గిడ్డియును వేసడంబును గిద్దనంగ
శ్యేనభేదంబులకుఁ బేళ్ళు శేషశయన. 152

ఏటిరింత, ఏటిఱింత, మంగలపిట్ట, నల్లచ్చిగాడు అన భారద్వాజము పేళ్ళు. కుమ్మరిగువ్వ, కాటుకపిట్ట, బువ్వఁబుల్లు అనఁగా ఖంజరీటము పేళ్ళు. కెంజు, కౌఁజు, కముజు అనఁగా కపింజలము పేళ్లు. కేరజము అన కేర్జము పేరు. జావడము, అడుజు, జాలియ, ఏలాఁపు, జాలె, ఓరణము, సాళువము, సాళ్వము, అణుజు, లగడు, సారణము, బాజు, చెంచడము, కురుజు, బైరి, నైల, గిడ్డి, వేసడము, గిద్దు, అనఁగా శ్యేనవిశేషముల పేళ్ళు.

సీ. భరతపక్షికిపేళ్ళు బరగెను కూఁకటి
గుడ్డంగి కూఁకటికువ్వో మఱియు
కూఁకటిమూఁగనాఁ గూడెను; కారండ
వమునకు కన్నెలేడి మరికరడు
కల్లేడునాఁగను జెల్లె; నింకను కళిం
గము పేళ్ళు కైజన కైదునాఁగ
నుల్లంకి కక్కెర యుల్లాము చిందచీ
పురుపిట్ట దోరువా పరజు చీఁద
గీ. యనఁగ పక్షివిశేషంబులౌను; కంక
ణాయి యోదెకొలుకు కంకణంబునోదె
కొంగ యాఁడే లడెలునా విహంగపతిర
థాంక! యగు జలపక్షిభేదాఖ్యలవని. 153

కూఁకటిగుడ్డంగి, కూఁకటికువ్వో, కూఁకటిమూఁగ అన భరతపక్షికి పేళ్ళు. కన్నెలేడి, కరడు, కల్లేడు అనఁగా కారండవము పేళ్ళు. కైజు, కైదు అనఁగ కళింగపక్షికి పేళ్ళు. ఉల్లంకి, కక్కెర, ఉల్లాము, చింద, చీపురుపిట్ట, దోరువా, పరజు, చీఁద అన పక్షివిశేషములు. కంకణాయి,

ఓదెకోలుకు, కంకణము, ఓదెకొంగ, ఆడేలు, అడెలు అనఁగా జలపక్షి విశేషములు.

క. పిట్ట యనం బులుఁగన నిరు
పుట్టావు పక్కి యన గుడ్డుపుట్టువనఁగ గూ
డ్బుట్టువన గూడుకాన్పన
దిట్టరి హరి! పక్షి పేళ్ళు తెనుఁగున వెలసెన్. 154

పిట్ట, పులుఁగు, ఇరుపుట్టువు, పక్కి, గుడ్డుపుట్టువు, గూడుకానుపు, గూడుకాన్పు, అనఁగ పక్షికి పేళ్ళు.

గీ. తేఁటియును మొగరంబంబు తేనెతిండి
జంటముక్కాలి తుమ్మెద సంజ్ఞ భ్రమర
మునకు; మిడుఁగుఱు మిణుఁగుఱుబురువు మిణుఁగు
అనఁగ ఖద్యోతమున కభిఖ్యలు మురారీ. 155

తేఁటి, మొగరంబము, తేనెతిండి, జంటముక్కాలి, తుమ్మెద అనఁగా భ్రమరమునకు పేళ్ళు. మిడుఁగుఱు, మిణుఁగుఱుబురువు, మిణుఁగుఱు అన ఖద్యోతమునకు పేళ్ళు.

గీ. గబ్బిడాయియు జిబ్బటీ గబ్బిలాయి
జిబ్బిడాయియు గబిలంబు గబ్బిలంబు
తైలపాయి కభిఖ్యలై తనరె; నీవ
యీఁగ యన మక్షికాఖ్యలౌ నింద్రరక్ష. 156

గబ్బిడాయి, జిబ్బటీ, గబ్బిలాయి, జిబ్బడాయి, గబిలము, గబ్బిలము అనఁగా తైలపాయికకు పేళ్ళు. ఈవ, ఈఁగ అన మక్షిక పేళ్ళు.

క. ఉరిడె యనంగను కుమ్మరి
పురుగన మృత్కీటమౌను; భువి ఝిల్లిక పే

రరయ యిలకోడి చిమ్మట
పురువనఁగను మఱియు నీల పుర్వన శార్గీ. 157

ఉరిడె, కుమ్మరిపురుగు అనఁగా మృత్కీటము పేళ్ళు. ఇలకోడి, చిమ్మటపురువు, ఈఁలపుర్వు అన ఝుల్లికపేళ్ళు.

ఆ.వె. పురుషమృగము పోతు; పురుషపక్షికి పుంజు
చెల్లు; పెంటి పిడియు స్త్రీమృగంబు;
పెట్టనాఁగ వెలసె పేరు స్త్రీపక్షికి
విమలకమలనేత్ర వేదపాత్ర. 158

పోతు అన పురుషమృగము పేరు. పుంజు అనఁగా పురుషపక్షికి పేరు. పెంటి, పిడి అనఁగా స్త్రీమృగము పేర్లు. పెట్ట అనఁగా స్త్రీపక్షికి పేరు.

ఆ.వె పిలుక కొదమ బోద పిల్లనా శిశువౌను;
జోడు దొందు దోయి జోక కవయు
యుగ్మమౌను; ద్వంద్వయుతమౌను జతగూడు
పెంటిపడును మఱియు దంటకట్టు. 159

పిలుక, కొదమ, బోద, పిల్ల అనఁగా శిశువునకు పేళ్ళు. జోడు, దొందు, దోయి, జోక, కవ అన యుగ్మమునకు పేళ్ళు. జతఁగూడు, పెంటిపడు, దంటకట్టు అనఁగా ద్వంద్వమగుట పేళ్ళు.

క. దంటయు సంగడి జమిలియు
జంటయు నుద్ది కవ నెట్టె జతయును గెడయుఁ
బొంటయనఁ సంగతమన
మింటియుడుగు వేల్ప! తోఁచె మిథునము పేళ్లై. 160

దంట, సంగడి, జమిలి, జంట, ఉద్ది, కవ, నెట్టె, జత, గెడ, పొంట, సంగతము అనఁగా మిథునము పేళ్ళు.

గీ. మిట్టిపడు మిడిమేలంబు మిడిసిపడన
నాంధ్రిమున నుద్గమించుటకౌను; తొంగు
నాఁ దొరంగన తొంగలినాఁగ తొరఁగు
ననఁగ వ్రాలన సండీర్ణమునకు పేళ్ళు. 161

మిట్టిపడు, మిడిమేలము, మిడిసిపడు అనఁగా ఉద్గమించుట పేళ్ళు. తొంగు, తొరఁగు, తొంగలి, తొరఁగు, వ్రాలు అన సండీర్ణమునకు పేళ్ళు.

గీ. ఎగు రెవయు నుం కొడియు నెగ వెగయు దూఁటు
కొను నెగయు దెంచు పల్లటీల్గొను నెగయును
మిట్టు పల్లటీల్ వైచును మిడియు పల్ల
టీలుదాటన నుద్గ మాఖ్యాళి శౌరి. 162

ఎగురు, ఎవయు, ఉంకు, ఒడియు, ఎగవు. ఎగయు, దూఁటుకొను, ఎగయుదెంచు, పల్లటీల్గొను, ఎగయు. మిట్టు, పల్లటీల్వైచు, మిడియు, పల్లటీల్ దాటు అనఁగా ఉద్గమను (ప్రడీనము) పేళ్ళు.

గీ. రెక్క చెట్టుప చట్టుప ఱెక్క ఱేకు
గఱి నెఱి నెరక గరుదభిఖ్యలగు; ఱేకు
లాఁక గోటాపనయు మఱి యీకయనఁగ
పత్త్రమగు; లావు లవిటినా బక్షతి యగు. 163

రెక్క, చెట్టుప, చట్టుప, ఱెక్క, ఱేకు, గఱి, నెఱి, ఎరక అన గరుత్తు పేళ్ళు. ఱేకు, లాఁక, గోటాపన, ఈఁక అనఁగా పత్త్రము పేళ్ళు. లావు, లవిటి అన పక్షతి పేళ్ళు.

గీ. ముక్కనఁగ చంచువగు; నీఁక చిక్కన నెఱి
యనఁగ ఛదపాళిసంకీర్ణమగును; మేఁత
పొంగిలి యనంగ నాహారమునకుఁ బేళ్లు;
నారెనా గోరనంగ నఖాఖ్యలౌను. 164

ముక్కు అన చంచువుపేళ్ళు. ఈఁకచిక్కు, ఱెటి అనఁగా ఛద పాళిసంకీర్ణముపేళ్ళు. మేఁత, పొఁగిలి అనఁగా పక్షుల ఆహారముపేళ్ళు. ఆరె, గోరు అన నఖరముపేళ్ళు.

గీ. అంతు రొదయు హళాహళి అంపనంగ
కలకలధ్వని పేళ్ళు; అంపిలునన రొద
సేయు అంతిల్లు నా ధ్వనిసేయుట; పొది
పదుపునా స్వజాతిగణంబు పరమపురుష. 165

అంతు, రొద, హళాహళి, అంపు అనఁగా కలకలధ్వనిపేళ్ళు. అంపిల్లు, రొదసేయు, అంతిలు అన ధ్వనిసేయుటపేళ్ళు. పొది, పదుపు అన స్వజాతిగణముపేరు.

సీ. అట్టియ గుమి గమి యంట జంజా దాటు
కూటువ కూటువు గుబురు గుముఁడు
తుటుము తుట్టియ తోఁగ త్రుట్టియ తెగ తెవ
దండు దోలా పరి దడము తుములము
కదుపు చేరువ తుట్టె గడ పొది బిఁడెంబు
మూఁక సంగడి పిండు ముంపు లేక
తెరలిక దిమ్మన బరగె సమూహంబు;
కుప్ప కూటువ కుప్వ లప్ప తెప్ప

గీ. కుటుకు తిట్టయు దోరయు కువయు లొద్ద
పోఁపు ప్రోకయు వామియు ప్రోగనంగ
నొప్పె రాశికి; కుప్పంబు కుప్పతిల్లు
కుప్పఁగూర యనఁగ రాశిగూడుటకును. 166

అట్టియ, గుమి, గమి, అంటు, దాటు, కూటువ, కూటువు, గుబురు, తుటుము, తుట్టియ, తోఁగ, త్రుట్టియ, తెగ, తెవ, దండు

తోలా, పరి, దడవు, తుటుము, కదుపు, చేరువ, తుట్టె, గడ, పొద్ది, బిందెము, మూఁక, సంగడి, పిండు, ముంపు, లేక, తెరలిక, దిమ్మ అనఁగా సమూహము పేళ్ళు. కుప్ప, కూటువ, కుప్వ, లప్ప, తెప్ప, కుఱుకు, తిట్ట, దొర, కువ, లొద్ద, ప్రోవు, పోరిక, వామి, ప్రోగు అనఁగా రాశికి పేళ్ళు. కుప్పము, కుప్పలిల్లు కుప్పఁగూర అన రాశిఁగూడు టకు పేళ్ళు.

గీ. గబ్బిలుంగన సకినాలగ్రద్దనాఁగ
సకినపు పులుంగనంగను శకునపక్షి
భేదములకయ్యె తెలుఁగున నాదితేయ
దుర్గనుతపాద! సింహాదివర్గుముగిసె. 167

గబ్బిలుఁగు, సకినాలగ్రద్ద, సకినపుపులుఁగు అనఁగా శకునపక్షివిశేష్యములకు పేళ్ళు.

సింహాదివర్గుముగిసెను.

---

# మనుష్యవర్గు

క. మగడనఁగను మగవాఁడన
మగబుట్టువు మొగయనంగ మానిసియనఁగన్
నెగడె మనుష్యునకును పే
రగు; పజయన ప్రజకునామ మౌనుమురారీ. 168

మగఁడు, రూ॥ మొగ, మగవాఁడు, మొగబుట్టువు, మానిసి అనఁగా మనుష్యుని పేళ్ళు. పజ అన ప్రజకు పేరు.

సీ॥ మాలిక. అతివ పొలంతుక యాఁడది యాఁడుది
యాఁటది యుగ్మలియన్ను కన్నె
యింతి యువిద మెత్త యెలనాగ పయిదలి
కొమ్మ కొమిరె కొమ యెమ్మెలాడి
చెలియ గుబ్బెత చెలి చెల్వ చేడియ చేడె
చాన కన్నియ కల్కి చామ చెలువ
తొయ్యలి నెలఁతుక తొయలి పడఁతుక
నవలా నవల పొల్తి నాతి గోతి
పడఁతి తెఱవ బోటి పైదలి నాతుక
పొలఁతుక నెలఁతయు పొలఁతి మగువ
మెల్తుక పొల్తుక మెలఁత మెలంతుక
వలఁతి బిత్తరి లేమ వెలఁది జోటి
గీ. ముదిత ముద్దియ మడఁతుక ముదియ మడఁతి
సకియ వెలఁదుక జోటిక సకి మడంతి
యనఁగ తెలుఁగున స్త్రీలనామాళి వెలసె
భర్మమృదుచేల మునిలోల ధర్మశీల. 169

అతివ, పొలంతుక, ఆఁడది, ఆఁడుది, ఆఁటది, ఉగ్మలిక, అన్ను, కన్నె ఇంతి, ఉవిద, మెత్త, ఎలనాగ, పయిదలి, కొమ్మ, కొమిరె, కొమ, ఎమ్మెలాడి, చెలియ, గుబ్బెత, చెలి, చెల్వ, చేడియ, చేడె, చాన, కన్నియ, కల్కి, చామ, చెలువ, తొయ్యలి, నెలఁతుక, తోయలి, పడతు, నవలా, నవల, పొల్తి, నాతి, గోతి, పడఁతి, తెఱవ, బోటి, పైదలి, నాతుక, పొలఁతుక, నెలఁత, పొలఁతి, మగువ, మెల్తుక, పొల్తుక, మెలఁత, మెలంతుక, వలఁతి, బిత్తరి, లేమ, వెలఁది, జోటి, ముదిత, ముద్దియ, మడఁతుక, ముదియ, మడఁతి, సకియ, వెలఁదుక, జోటిక, సకి, మడంతి అనఁగా స్త్రీలకు పేళ్ళు.

సీ. అందకత్తె యొయారి యలరుఁబోఁడి మిటారి
యొయ్యారి యోయారి యొప్పులాడి
కొమరాలు జవరాలు కుల్కులాడియు మచ్చె
కంటి వాలుగకంటి కలువకంటి
తెలిగంటి వాల్గంటి తీఁగబోఁడియు లేడి
కంటి యొప్పులకుప్ప క్రాలుఁగంటి
చిల్కలకొలికియు చిగురుబోఁడియు తమ్మి
కంటియు లతకూన కపురగంది
గీ. ముద్దులాడియు సింగారి ముద్దుగుమ్మ
మించుబోఁడియు ననబోఁడి మెఱుఁగుబోఁణి
చిన్నెలాడి యొఱపులాడి వన్నెలాడి
యనఁగ స్త్రీవిశేషాఖ్యలౌ నమరవినుత. 170

అందకత్తె, ఒయారి, అలరుబోఁడి, మిటారి, ఒయ్యారి, ఒయారి, ఒప్పులాడి, కొమరాలు, జవరాలు, కుల్కులాడి, మచ్చెకంటి, వాలుకంటి, కలువకంటి, తెలిఁగంటి, వాల్గంటి, తీగబోడి, లేడికంటి, ఒప్పులకుప్ప, క్రాలుఁగంటి, చిల్కలకొలికి, చిగురుబోఁణి, తమ్మికంటి, తకూన, కపురగంది, ముద్దులాడి, సింగారి, ముద్దుగుమ్మ, మించుబోఁణి, ననబోఁడి, మెఱుఁగుబోఁడి, చిన్నెలాఁడి, ఒఱపులాడి, వన్నెలాడి అనఁగా స్త్రీవిశేషణనామములు.

క. అయిదువరా లైదువ ము
త్తయిదువ ముత్తోయనంగ నగును చిరంట్యా
హ్వాయములిల; పేరఁటాలు న
రయ జక్కని నాఁగ మృతచిరంటికభిఖ్యల్. 171

అయిదువరాలు, ఐదువ, ముత్తైదువ, ముత్తో అనఁగా సువాసినికి పేళ్లు. పేరంటాలు, జక్కని అనఁగా మృతసువాసినికి పేళ్ళు.

గీ. జాణెత గయ్యాళి గయ్యాళి జంత గట్టి
వాయి గొంటెయనఁగ ధూర్తవధువగు; జవ
రాలు నా జవ్వనియు కొమరాలనంగ
యౌవనస్త్రీ కభిఖ్యలౌ నంబుజాక్ష. 172

జాణెత, గయాళి, గయ్యాళి, జంత, గట్టివాయి, గొంటు అన ధూర్తస్త్రీ పేళ్ళు. జవరాలు, జవ్వని, కొమరాలు అనఁగా యౌవనస్త్రీ పేళ్ళు.

గీ. ముగ్ద ముగుదయు ముద్దరాల్ ముగ్ధపేళ్లు
కన్నియ పడుచు చిఱుతుక కన్నె గోల
కన్యకాఖ్యలగును; వంజకత్తె గొంజ
కత్తె గొడ్డుది నా వంధ్య కమలనాభ. 173

ముగ్ద, ముగుద, ముద్దరాలు అనఁగా ముగ్ధకు పేళ్ళు. కన్నియ, పడుచు, చిఱుతుక, కన్నె, గోల అన కన్యక పేళ్ళు. వంజకత్తె, గొంజకత్తె, గొడ్డుకత్తె అనఁగా వంధ్యకు పేళ్ళు.

గీ. రాణివాసంబనంగను రాణివాసి
యనఁగ నంతఃపురస్త్రీకి నలరెను; దొర
సాని దేవేరి దేవెరి రాణి దుండి
నాఁగ రాజమహిషి పేళ్లు నలిననాభ. 174

రాణివాసము, రాణివాసి అనఁగా అంతఃపురస్త్రీకి పేళ్ళు. దొరసాని, దేవేరి, దేవెరి, రాణి, దుండి అన రాజమహిషి పేళ్ళు.

గీ. గట్టువాలన సైరంధ్రి; కుట్టనికిని
కుంటనియు పొంతకత్తె నాఁ గూడె పేళ్లు;
తాపికత్తియనాఁగ సంధానవధువు;
దొడవనాఁగ కురూపియౌ జడధిశయన. 175

గట్టువాలు అన. సైరంధ్రిపేరు. కుంటని, పొంతకత్తె అన కుట్టనిపేళ్ళు. తాపికత్తె అనసంధానస్త్రీపేరు. దొడవ అన కురూపిపేరు.

గీ. ఇలను హెగ్గడికత్తియ హెగ్గడియును
పక్కెరాలు నంతఃపురపాలనియగు;
చదుర చదురాలును సమర్థవధువుపేళ్లు;
దూతికకు జూజి యెడకత్తె ఖ్యాతిమీఱె. 176

హెగ్గడికత్తె, హెగ్గడి, పక్కెరాలు అనఁగా అంతఃపురపాలనిపేళ్ళు. చదుర, చదురాలు అన సమర్థురాలిపేరు. జూజి, ఎడకత్తె అన దూతిపేళ్లు.

క. చెలికత్తె జోటికత్తియ
చెలి సకియయు బోటికత్తె చెల్మివెలఁదియుం
జెలిమరి గమికత్తియ సకి
చెలఁగెను సఖికాహ్వయములు శేషశయానా. 177

చెలికత్తె, జోటికత్తియ, చెలి, సకియ, బోటికత్తె, చెల్మివెలఁది, చెలిమరి, గమికత్తియ, సకి అనఁగా సఖికిపేళ్ళు.

గీ. పారికయు దాసురాలును బానిసయును
తొత్తనఁగ దాసియగు; తాఁటకత్తె మోస
కత్తెయన వంచనాకృతకాంత పేళ్లు;
కుంకయన బాలవిధవయౌ పంకజాక్ష. 178

పారిక, దాసురాలు, బానిస, తొత్తు అనఁగా దాసికిపేళ్ళు. తాఁటకత్తె, మోసకత్తె అనఁగా వంచనాకృతస్త్రీకిపేళ్ళు. కుంక అన బాలవిధవపేరు.

క. మేలరి గరితయు క్రొత్తడి
వాలెంబు పతివ్రతయగు; బాలెంతయనఁ

బాలెంతరాలనఁగ పురు
టాలనఁగ ప్రసూతకాఖ్యలగును ముకుందా. 179

మేలరి, గరిత, క్రొత్తడి అనఁగా పతివ్రతకు పేర్లు. బాలెంత, బాలెంత రాలు, పురుటాలు అన ప్రసూతకు పేళ్ళు.

గీ. చెడిప దిచ్చరి నసఁగూటి చెదుగు బసివి
అంకులాడియు అంకెత తాఁగ నను పు
కత్తె విటుకులాడియు విటకత్తె అంకు
టాలు మిండత జారిణికాఖ్యలు హరి. 180

చెడిప, దిచ్చరి, నసఁగూటి, చెదుగు, బసివి, అంకులాడి, అంకెత, తాఁగ, ననుపుకత్తె, విటుకులాడి, విటకత్తె, అంకుటాలు, మిడంత అన జారిణిపేళ్ళు.

క. తెనుఁగుననగు మగడనఁగను
పెనిమిటియన సామియనఁగ పెన్మిటియన తే:
డన నొడయండన నొడయుం
డన భర్తకుపేళ్ళు వినుత హంసతురంగా. 181

మగడు, పెనిమిటి, సామి, పెన్మిటి, తేఁడు, ఒడయఁడు, ఒడయుఁడు అన భర్తకు పేళ్ళు.

గీ. ఆలు పెండ్లాము పెండ్లమిల్లాలు గరిత
రాణి ప్రోయాలనఁగ భార్యకౌను; తోడి
కోడ లేరాలు యాత్రాఖ్యకోటికగు; స
వతియు సవతాలునాఁగ సపత్ని శౌరి. 182

ఆలు, పెండ్లాము, పెండ్లము, ఇల్లాలు, గరిత, రాణి, ప్రోయాలు అన భార్య పేళ్ళు. తోడికోడలు, ఏరాలు అన యాతకు పేళ్ళు. సవతి, సవతాలు అన సపత్ని పేళ్ళు

గీ. అమ్మ యమ యవ్వ యవ యప్ప యపయుం దల్లి
తాయి తలి నాఁగ జననియౌ; తండ్రి యయ్య
యప్ప యయ తండిరియు నప యబ్బ పితరుఁ
డన బితృవు; భ్రాతృవున కన్న యనయు శౌరి. 183

అమ్మ, అమ, అవ్వ, అవ, అప్ప, అప, తల్లి, తాయి, తలి అన జననికి పేళ్ళు. తండ్రి, అయ్య, అప్ప, అయ, తండిరి, అప, అబ్బ, పితరుఁడు అన జనకునకుఁ బేళ్ళు. అన్న, అన అనఁగ భ్రాతృనిఁ బేళ్ళు.

గీ. తోడబుట్టు తోఁబుట్టు సైదోడు తమ్ముఁ
డన సహోదరుఁడగు; నప్ప యక్క యపయు
నాఁగ జ్యేష్ఠభగినిపేళ్ళు; నాగశయన!
దాదిదాదిలియన స్తన్యదాయిజనని. 184

తోడబుట్టు, తోఁబుట్టువు, సైదోడు, తమ్ముడు అన సహోదరునిఁ బేళ్ళు. అప్ప, అక్క, అప అనఁగా జ్యేష్ఠభగినిఁ బేళ్ళు. దాది, దాదిలి అన ధాత్రికి పేళ్ళు.

గీ. చెల్లియలును తోఁబుట్టువు చెల్లె లాడు
తోఁడు చెలియలు చెల్లె సైదోడనంగ
సోదరికిపేళ్లగును; తోఁడిచూలు తోఁడు
నాఁగ సహజన్మునకుపేళ్ళు నలిననాభ. 185

చెల్లియలు, తోబుట్టువు, చెల్లెలు, ఆఁడుతోడు, చెల్లియలు, చెల్లె, సైదోడు అనఁగా సోదరికి పేళ్ళు. తోఁడిచూలు, తోఁడు అనఁగా సహజన్మునకు పేళ్ళు.

క. పట్టి కొమారుఁడు కొమరుఁడు
బొట్టె కొడుకు కుఱ్ఱ కూన బొట్టెయుఁడును తో

పుట్టువు బిడ్డఁడు కుఱ్ఱఁడు
బొట్టియ బిడ్డ యన వెలసె పుత్రునిపేళ్లై 186

పట్టి, కొమారుఁడు, కొమరుఁడు, బొట్టె, కొడుకు, కుఱ్ఱ, కూన, బొట్టియఁడు, మేపుట్టువు, బిడ్డఁడు, కుఱ్ఱఁడు, బొట్టియ, బిడ్డ అనఁగా పుత్రునకు పేళ్ళు.

గీ. కూఁతురు కొమార్తె కొమరిత కూన కూఁతు
పట్టి మేపుట్టువు కొమారి బొట్టె యాఁడు
బిడ్డ కన్నె కొమారిత బిడ్డయనఁగ
జెల్లె పుత్రికాభిఖ్యలై శేషశయన. 187

కూఁతురు, కొమార్తె, కొమరిత, కూన, కూఁతు పట్టి, మేపుట్టువు, కొమారి, బొట్టె, ఆఁడుబిడ్డ, కన్నె, కొమారిత, బిడ్డ అనఁగా పుత్రికకు పేళ్ళు.

ఆ.వె అల్లువాఁడనంగ నల్లుఁడనంగ జా
మాతృసంజ్ఞ; మామ మాతులుండు
తాతనాఁగ తండ్రితండ్రియనఁగ పితా
మహుని కాఖ్యలౌ రమాహృదీశ. 188

అల్లువాఁడు, అల్లుఁడు అనఁగా జామాతృపేళ్ళు. మామ అన మాతులుని పేరు. తాత, తండ్రితండ్రి అనఁగా పితామహుని పేళ్ళు.

గీ. జగిలెఁడన సడ్డకుండన జగిలెకాఁడు
నాఁగ మఱి తోఁడియల్లుండునాఁగ షడ్డ
కాఖ్యలౌ; బావ యన దేవరాఖ్య; వదినె
నాఁగ భ్రాతృజాయ; మఱఁదినాఁగ స్యాల. 189

జగిలెఁడు, సడ్డకుఁడు, జగిలెకాఁడు, తోఁడియల్లుఁడు అన షడ్డకుని పేళ్ళు. బావ అన దేవరకు పేరు. వదినె అన భ్రాతృభార్యకు పేరు. మఱఁది అన స్యాలనామము.

గీ. చూలు వేకటి కరువును చూఁడి నాఁగ
గర్భిణికి పేళ్ళు; ప్రసవాఖ్య కానుపౌను;
గర్భమునయిచ్ఛలకు పేరు గంట్లనౌను;
సంతినంగ సంతానమౌ సత్యశీల. 190

చూలు, వేకటి, కరువు, చూఁడి అనఁగా గర్భిణికి పేళ్ళు. కానుపు అనఁగ ప్రసవము పేరు. గంట్లు అన గర్భమునయిచ్ఛకు పేరు. సంతు అనఁగా సంతానము పేరు.

గీ. వెలసె బయ్యెంకలనఁగ వేవిళ్లనంగ
దౌహృదము; రజస్వలకగు తలగు ముట్టు
చెలఁగుమాయు ననఁగఁ బేళ్ళు జెల్లెఁ; మావి
నాఁగ గర్భాశయము పేరు నలిననాభ. 191

బయ్యెంకలు, వేవిళ్లు అనఁగా దౌహృదము పేళ్ళు. తలగు, ముట్టు చెలఁగుమాయు (ఋతుమతి) అనఁగా రజస్వలకు పేళ్లు. మావి అన గర్భాశయము పేరు.

ఆ.వె. పాప బుడుత బిడ్డ పట్టి బుఱుక కందు
కుఱ్ఱ కున్న సిసువు కూన నిసుగు
నిసువునా శిశువగు; కసుగందు నెఱగందు
చూలి పూప తరుణ శిశువుపేళ్ళు. 192

పాప, బుడుత, బిడ్డ, పట్టి, బుఱుక, కందు, కుఱ్ఱ, కున్న, సిసువు, కూన, నిసుగు, నిసువు అన శిశువుపేర్లు. కసుగందు, ఎఱగందు, చూలి, పూప అన తరుణశిశువుపేళ్ళు.

ఉ. బొట్టెఁడు పిల్లకాయ చొఱ బోఁడిక కొండొక పైద ఠింగణా
బొట్టియ పాపఁడున్ పసిఁడు బుర్కడు కొండిక పిల్లగాఁడనన్

బొట్టెయనంగ చోఁటియును ఫూపయునంగను పిల్లఁడన్న నొ
పట్టియనంగ కుఱ్ఱఁడన బాలున కాఖ్యలు హాటకాంబరా. 193

బొట్టెడు, పిల్లకాయ, చోఁటి, బోఁడిక, కొండొక, పైద, తింగణా బొట్టియ, పాపడు, పసఁడు, బొర్కడు, కొండిక, పిల్లగాఁడు, పొట్టె చోఁటి, ఫూప, పిల్లఁడు, పట్టి, కుఱ్ఱఁడు అనఁగా బాలునకు పేళ్ళు.

గీ. చన్గుడుచు కుడ్చు నిముడన స్తన్యపాన
మనాను; తడవాడు దోఁగు దోఁగాడు దోఁగి
యాడు నంబాడు తడవన నౌను జాన
కరతలగమనమున కభిఖ్యలు మురారి. 194

చన్గుడుచు, కుడుచు, నిముడు అనఁగా స్తన్యపానము పేళ్ళు. తడవాడు, దోఁగు, దోఁగాడు, దోఁగియాడు, అంబాడు, తడవు అనఁగా జానుకరతలగమనము పేళ్లు.

గీ. పారడయు నుగ్గుచిప్పయు పాలడయున
సంజ్ఞయగు శిశుస్వాదితశంబుకంబు
నకును; బోరుకాడించన నామధేయ
మా శిశుస్నానకృత్యం బహార్యభరణ. 195

పారడ, ఉగ్గుచిప్ప, పాలడ అనఁగా శిశుస్వాదితశంబుకము పేళ్ళు. బోరుకాడించు, రూ॥ బోర్కాడించు అనఁగా శిశుస్నానకృత్యంబునకు పేరు.

ఆ.వె. కొమరుఁదనమునంగ కొమరన తెఱపినా
పాయమనఁగ నీరుపాయమనఁగ
జవ్వనంబనంగ సరిపాయమనఁగను
గోవనాఁగనౌను యౌవనంబు. 196

కొమరుఁదనము, కొమరు, తెఱపి, పాయము, నీరుపాయము, జవ్వనము, సరిపాయము, గోవ అన యౌవనము పేళ్ళు.

క. ముదిమియనఁగ కారనఁగను
ముదుసలినా ముసలినాఁగ ముదుకయనంగన్
ముదినాఁగను వృద్ధాప్యము
పొదిగొనెఁ; నన్నగళ యన నపుంసకుఁడు హరీ. 197

ముదిమి, కారు, ముదుసలి, ముసలి, ముదుక, ముది అనఁగా వృద్ధాప్యము పేళ్ళు. అన్నగళ అన నపుంసకుని పేరు.

గీ. కోడెకాఁడన బొజుఁగన కోడెనాఁగ
జుమ్మఁడన నన్నుకాఁడన జుమ్మకాఁడు
నాఁ జెలువుఁడన మిండఁడునాఁగ వెచ్చ
కాఁడు విటకాఁడునా విటాఖ్యలు ముకుంద. 198

కోడెకాఁడు, బొజుఁగు, కోడె, జుమ్మఁడు, నన్నుకాఁడు, జుమ్మకాఁడు, చెలువుఁడు, మిండఁడు, వెచ్చకాఁడు, విటకాఁడు అన విటునకు పేళ్ళు.

గీ. తొత్తు వెలయాలు వేడుకకత్తె లంజ
యాటవెలఁది రోవెలదియు నాటకత్తె
గడనకత్తె గణకత్తె పడపుఁగొమ్మ
వేల్పుబానిస లంజెత వేశ్యపేళ్ళు 199

తొత్తు, వెలయాలు, వేడుకకత్తె, లంజె, ఆటవెలఁది, రోవెలఁది, ఆటకత్తె, గడనకత్తియ, గణనకత్తె, పడపుఁగొమ్మ, వేల్పుబానిస, లంజెత అన వేశ్యకు పేళ్ళు.

గీ. తొంగద తొందు లందయు దొద్దు తుందిలాఖ్య
లౌను; బంబోతునా మొక్కఁడన బలసిన

వాఁడనంగ స్థూలాంగుఁడౌ బక్కవాఁడు
బక్కనాఁగ కృశాంగుఁడౌ పద్మనేత్ర. 200

తొంప, తొందు, లంద, దొడ్డు అనఁగా తుందిలుని పేళ్ళు. బంబోతు, మొకద్దు, బలసినవాఁడు అనఁగా స్థూలాంగుని పేళ్ళు. బక్కవాఁడు, బక్క అన కృశాంగుని పేళ్ళు.

క. ఆబూతికాఁడు తిండీ
డాబూతీడు పెనుతిండి హాబూతియు నా
నాబూతి తిండిపోతన
నాఁబడె నతిభక్షుకునకు నాఖ్యలు శౌరీ. 201

ఆబూతికాఁడు, తిండీడు. ఆబూతీడు, పెనుదిండి, హాబూతి, ఆబూతి, తిండిబోతు అన అతిభక్షకుని పేళ్ళు.

క. పొటి ఠింగణా బుడుతయును
గిటక పొదరు పొట్టి గుజ్జు గిడ్డ బుడుగనఁగ
వటునకు నభిఖ్య; లవిటుకొ
నటినా హరి యంగహీను నకు నామంబుల్. 202

పొటి, ఠింగణా, బుడుత, గిటక, పొదరు, పొట్టి, గుజ్జు, గిడ్డ, బుడుగు అనఁగా వటువునకు పేళ్ళు. అవిటు, కొనటి అన అంగహీనుని పేళ్ల

క. చెవుటియన చెవుటివాఁడన
నవని బధిరునకు నభిఖ్యలగు; చీకనక
న్నవిటియును గ్రుడ్డివాఁడన
నవు నంధునకాహ్వయంబు లాంధ్రమున హరీ. 203

చెవుటి, చెవుటివాఁడు అన బధిరునకు పేళ్ళు. చీకు, కన్నవిటి, గుడ్డి వాఁడు అనఁగా అంధునకు పేళ్ళు.

గీ. కుంటినా గుంటనఁగ పిచ్చుకుంటనంగ
కుంటు పిచ్చుక పిచ్చుకకుంటనంగ
పంగునకు; నోరుమెంగయు ముంగ మూఁగ
యెడ్డినాఁగను మూకాఖ్యలెసఁగె శౌరి. 204

కుంటి, కుంటు, పిచ్చుకుంటు, కుఁటు, పిచ్చుక, పిచ్చుకకుంటు అన పంగువు పేళ్ళు. నోరుమెంగ, ముంగ, మూఁగ, ఎడ్డి అనఁగా మూకకు పేళ్ళు.

క. నలుకువయున తెగులనఁగా
నలినా తెవులనఁగ రోగ నామంబులగున్;
తెలుఁగున వెజ్జన వైద్యుం
డలరెను; మందనఁగ నౌషధాఖ్య మురారీ. 205

నలుకువ, తెగులు, నలి, తెవులు అనఁగా రోగమునకు పేళ్ళు. వెజ్జ అనఁగా వైద్యునకు పేరు. మందు అన ఔషధము పేరు.

ఆ.వె. పాలివాఁడు దాయ పాలిచుట్టము పాలి
పాలికాఁపునాఁగఁ బరఁగె జ్ఞాతి;
వావి చుట్టరికము బంధుత్వమునకౌను;
వావి వరుస బాంధవక్రమంబు. 206

పాలివాఁడు, దాయ, పాలిచుట్టము, పాలి, పాలికాఁపు అనఁగా జాతికి పేళ్ళు. వావి, చుట్టరికము, అన బంధువుల పేళ్లు. వావి, వరుస అన బాంధవ్యక్రమము పేళ్లు.

క. బందువుడన చుట్టంబన
బందుగుడన విందనంగ బహువచనంబుం
జెందిన చుట్టలు చుట్టా
లుం దగు బంధువునకాఖ్యలును శ్రీరమణా. 207

బందువు, చుట్టము, బందగు, విందు చుట్టాలు, అన బంధువు నకుపేళ్లు.

క. మేనన మైనా నొడలన
మేనాఁగను బొందినాఁగ మేయియు నోలం
బౌనన దేహము పేళ్లగు
దానవకులవన సమూహ దావానలమా. 208

మేను, మై, ఒడలు, మే, బొంది, మేయి, ఓలము అనఁగా దేహమునకు పేళ్ళు.

క. జలనిధిశయనా! యుడువన
నడయనఁగా జోకయనఁగ సొగడవనఁగన్
పొడయనఁగా రూపనఁగను
వడసెను రూపంబుఁ బేళ్లు వసుధ దెలుఁగునన్. 209

ఉడువు, అడ, జోక, పొడలు, పొడ, రూపు అనఁగా రూపమునకు పేళ్ళు.

ఆ వె. పుర్రె పుఱియ పునుక పుట్టియ నాఁగ క
పాలంబు పేళ్ళు; పోతరంబు మత్తు
పీచ మామికయును పించంబు హామిక
మంపు క్రొవ్వు నాఁగ మదముపేళ్లు. 210

పుర్రె, పుఱియ, పునుక, పుట్టియ అనఁగా కపాలము పేళ్ళు. పోతరము, మత్తు, పీచము. ఆమిక, పించము, హామిక, మంపు, క్రొవ్వు అన మదము పేళ్ళు.

గీ. ఎముక యెమ్ముక యెమ్మును బొమికె బొఁకె
ముడుసు నాఁగ బహువచనమునను మక్కె

లనఁగ శల్యాఖ్యలౌ హృదయంబుపేళ్లు
గుండెకాయ కందనకాయ గుండెయనఁగ. 211

ఎముక, ఎమ్ముక, ఎమ్ము, బొమికె, బోఁకె, ముడుసు, బ॥ మక్కలు అనగ శల్యముల పేళ్ళు. గుండెకాయ, కందనకాయ, గుండె అన హృదయము పేళ్ళు.

కం. మూలుగనగ నెమ్మూటయు
పూలుగునా జెక్కమనఁగ పూల్గును నెనదుల్
వాలెంబు మజ్జమంబౌ;
నీలాంగా! బక్కయనఁగ నెగడె త్వగాఖ్యల్. 212

మూలుగ, ఎమ్మూట, పూలుగు, చెక్కను, పూల్గు, నెనడు అన మజ్జము పేళ్ళు. బక్క అన త్వక్కు పేరు.

క. ఆడు గడ్డు మెట్ట యజ్జయు
నడువును హజ్జయన నంజయన నంఘ్రికి పే
ళ్లడరెను;మీగాలనఁగను
బడసె ప్రపదమునకుపేరు పంకజనాభా. 213

అడుగు, అడ్డు, మెట్ట, అజ్జ, అడువు, హజ్జ, అంజ అనఁగా అంఘ్రికి పేళ్ళు. మీగాలు అనఁగా ప్రపదము పేరు.

క. కుడికాలు మించుకాలన
బడె దక్షిణపాదమునకు; ప్రసృతముపేళ్లౌ
బడసెను పిక్కయనఁగ చిఱు
తొడనా జంగయన భువిని తోయజనాభా. 214

కుడికాలు, మించుకాలు అన దక్షిణపాదము పేర్లు. పిక్క, చిఱు తొడ, జంగ అనఁగా ప్రసృతము పేళ్ళు.

క. ముడుమనఁగను మోకాలన
నడరెను జానువున కాఖ్యలగుచు తెనుఁగునన్;
తొడయనఁగను కురువస మఱి
యొడినా నూరువున కాఖ్యలొప్పె మురారీ. 215

ముడుము, మోకాలు అన జానువునకు పేళ్లు. తొడ, కురువు, ఒడి యన ఊరువునకు పేళ్లు.

గీ. ఆరు నూగారు రోమాళికౌను; బొడ్డు
పొక్కిలి యనంగ నాభియా; పొట్ట బొజ్జ
కడుపు బొఱ డొక్క బొజ్జయు కడుపనాఁగ
గర్భమున కాఖ్యలైయొప్పె కమలనాభ. 216

ఆరు, నూగారు అన రోమాళిపేళ్ళు. బొడ్డు, పొక్కిలి అన నాభికి పేళ్ళు. పొట్ట, బొజ్జ, కడుపు, బొఱ్ఱ, డొక్క, బొజ్జ, కడుపు అనఁగా గర్భమునకు పేళ్ళు.

క. మడతయు మడుపును తఱియును
ముడుతయు నిత్యబహువచనమున ముడుతలసం
బడౌ వళులకు పేళ్లన్; మొల
నడుము కవును కౌను నడ్మ నాఁ గటి పేళ్లౌ. 217

మడత, మడుపు, తఱి, ముడుత, బ॥ ముడుతలు అన వళులకు పేళ్ళు. మొల, నడుము, కవును, కౌను, నడ్మ అన కటిపేళ్లు.

క. వెనునా వెన్నన వీఁపన
గను పృష్ఠము; కొప్పెర మఱికయు పుత్తయు మూ

పన స్కంధము పేళ్లగు; పిఱుఁ
దన పిఱ పిఱ్ఱియన నగు నితంబము శౌరీ. 218

వెను, వెన్ను, వీఁపు అన పృష్టమునకు పేర్లు. కొప్పరము, అఱక, పుత్త, మూపు అనఁగా స్కంధమునకు పేర్లు. పిఱుఁదు, పిఱ, పిఱ్ఱ అన నితంబమునకు పేర్లు.

క. చనునాఁ జన్నన గుబ్బయ
నను చాచియనఁగ బహువచనంబున పాలిం
డ్లన కుచసంజ్ఞయు; చనుమొఱ
యన చూచుకవృత్తనీలమగు మధువైరీ. 219

చను, చన్ను, గుబ్బ, చాచి, బ॥ పాలిండ్లు అన కుచము పేర్లు. చనుమొఱ అన చూచుకముచుట్టువుండు నీలవర్ణమునకు పేరు.

క. కాము బొగడ యంచును చ
న్మొనను చన్మొనయు బొడ్డె మొన చన్మొక్కన్
నామములు చూచుకమునకు
సామజరాడ్వినుతనామ సంగరభీమా. 220

కాము, బొగడ, అంచు, చన్మొనము, చన్మొన, బొడ్డె, మొన చన్మొక్క అనఁగా చూచుకమునకు పేర్లు.

గీ. భువిని కోలెమ్మునా బూసబొక్క కోలె
ముకయునాఁగ కశేరు పేళ్లు; టికమనఁగ గు
దోపరితటిశల్యము; చంకయు మడిసందు
చక్కిలియుఁ జంకిలియనఁ గక్షంబు పేళ్ళు 221

కోఁతెన్ను, పూసబొక్క, కోఁతెముక అన కశేరుపేళ్లు. టికము అన గుదోపరి తటీశల్యము పేరు. చంక, చదిసందు, చక్కిలి, చంకిలి అన కక్షము పేళ్లు.

గీ. అక్కునంగ కౌఁగిలియు బోరయనంగ ఱొమ్ము
నాఁగ వక్షంబు; పక్కయనంగ నంక
నాఁగ నంచల బహువచనమున నిక్కీ
యలన పార్శ్వంబునకుఁ బేళ్లు జలజనాభ. 222

అక్కు, కౌఁగిలి, బోర, ఱొమ్ము అన వక్షమునకుఁ బేళ్లు. పక్క, అంక, అంచల, బ॥ ఇక్కియలు అనఁగ పార్శ్వమునకుఁ బేళ్లు.

గీ. జబ్బ బుజ రెట్ట యెఱక బుజమన భుజము;
చెయ్యి చేఁ జెయి కై చేయి చెట్ట కేలు
కయి యనఁగ బాహువునకు; ప్రగండమునకు
దండచేయియు సందిలి దండనాఁగ. 223

జబ్బ, బుజ, రెట్ట, ఎఱక, బుజము అనఁగా భుజముపేళ్లు. చెయ్యి, చే, చెయి, కై, చేయి, చెట్ట, కేలు, కయి అన బాహువుపేళ్లు. దండచేయి సందిలి, దండ అనగా ప్రగండముపేళ్లు.

గీ. కూర్పరంబు మోఁజెయ్యి; ప్రకోష్ఠమునకుఁ
బేళ్లు ముంగేలు ముంజెయ్యిఁ జెల్లెను; మణి
బంధమగు మణికట్టన; పాణిపేళ్లు
కేలు క్రేఁగయినాఁగను నీలదేహ 224

మోఁజెయ్యి అన కూర్పరముపేరు. ముంగేలు, ముంజెయ్యి, అన ప్రకోష్ఠముపేళ్లు. మణికట్టు అన మణిబంధముపేరు. కేలు, క్రేఁగయి అన పాణిపేళ్లు.

సీ. అంగుళసంజ్ఞ వేలనఁగ వ్రేలనఁగ; నం
గుష్ఠంబుసంజ్ఞ యంగుటము బొటన
వేలు పెద్దనవ్రేలు వెలసె; తర్జనినామ
వివరంబు చూపుడువ్రేలనంగ
జుత్తునవేలన జుట్టనవ్రేలన;
దనరె మధ్యాంగుళమునకు నడిమి
వ్రే; లనామికసంజ్ఞ విలసిల్లె భువి; దబ్బ
వే; ల్కనిష్ఠకమగు పిల్లవ్రేలు
గీ. నాఁగ చిటివేలు చిటికెన నాఁగ; నఖము
గోరనఁగ పేరునొందె; నంగుష్ఠ తర్జ
నికిని మధ్యభాగముపేరు నెగడె దనుజ
వంశమర్దన యుప్పలవాయినాఁగ. 225

వేలు, వేరిలు అన అంగుళము పేర్లు. అంగుటము, బొటనవేలు, పెద్దనవేరిలు అన అంగుష్ఠమునకు పేర్లు. చూపుడువ్రేలు, జుత్తునవేరిలు, జుట్టనవేలు అన తర్జనికి పేర్లు. నడిమివ్రేలు అన మధ్యాంగుళము పేరు. దబ్బవేలు అన అనామికము పేరు. పిల్లవేలు, చిటివేలు, చిటికెన అనఁగా కనిష్ఠమునకుఁ పేర్లు గోరు అనఁగా నఖము పేరు. ఉప్పలవాయి అనఁగా అంగుష్ఠతర్జనిమధ్యభాగమునకు పేరు.

గీ. దోయిలియు: పట్టిలియు నాఁగ దోసిలియన
నంజలికి పేళ్లు; కొడిదిలియన కొడివిలి
యనఁగ చేరయునాఁ బ్రతాఖ్యలు; పిడికిలి
గుప్పిలియు పిడినాఁగ నిశుజ్జమానాను. 226

దోయిలి, పట్టిలి, దోసిలి అన అంజలికిపేర్లు. కొడిదిలి, కొణిదిలి, చేయి అనఁగా ప్రతలముపేర్లు. పిడికిలి, గుప్పిలి, పిడి అన నికుబ్జముపేర్లు.

క. పుడిసిడియన కమియనఁగను
కొడిదిలియన కమికిలియును కొణిదిలియనఁగన్
బడసె ప్రసృతినామంబులు
జడధితరంగగణశయన సారసనయనా. 227

పుడిసిడి, కమి, కొడిదిలి, కమికిలి, కొణిదిలి అనఁగా ప్రసృతికిపేర్లు.

గీ. శిరము తల యవుఁదల నాఁగ శిరముపేళ్లు;
వాయి నోరును వా నాఁగ వక్త్రసంజ్ఞ;
యట్టు కుత్తిక గొంతుక యఱు కుతికయు
గొంతు మెడ యన గళనామ కోమలాంగ. 228

సిరము, తల, అవుఁదల అన శిరముపేర్లు. వాయి, నోరు, వా అన వక్త్రముపేర్లు. అట్టుకుత్తిక, గొంతుక, అఱు, కుతిక, గొంతు, మెడ అన గళముపేర్లు

క. ముకు ముక్కన నాసికయగు
మొకము మొగము మోమనంగ ముఖమగు; పొటముక్
ముకుఁ జెమర చెరమ పొడమ
న్ముకుఁజెఱమయుఁ జెరమ ఘ్రాణపుటమగు శౌరీ. 229

ముకు, ముక్కు అన నాసికపేర్లు. మొకము, మొగము, మోము, అన ముఖముపేర్లు. పొటము ముకు, జెమర, చెరమ, పొడమ, ముకుఁజెఱమ (రూ॥ ముకుంజెఱమ) జెఱమ అన నాసాపుటముపేర్లు.

గీ. సోణమనఁగ నాసామూలమగును; సోఁడు
నాఁగ చోడన నుచ్చియనంగ బ్రహ్మ

రంధ్రమగును; మొక్కట్టన రాజిలె భువి
నాంధ్రమున ముఖవైఖరి కాఖ్య శౌరి. 230

సోణము అన నాసామూలము పేరు. సోడు, చోడు, ఉచ్చి అన బ్రహ్మరంధ్రము పేర్లు. మొక్కట్టు అన ముఖవైఖరి పేరు.

క. పలుకప్పన పెదవియనం
బలుఁదెరయన మోవినాఁగ వాతెరయన ప
ల్వాలువయనఁగ వాతెఱయన
నలినాయతనేత్ర యధర నామంబులగుఁ. 231

పలుకప్పు, పెదవి, పలుదెర, మోవి, వాతెర, పల్వాలువ, వాతెఱ అనఁగ అధరము పేర్లు.

క. గరువనఁగను చెక్కిలియన
చెరపయు చెక్కునఁగ చెంక చెంపయనంగ
బరగె కపోలాఖ్యలు ని
ద్ధర దాళువ దవుడ దౌడ తాలువు పేర్లౌ. 232

గరువు, చెక్కిలి, చెరప, చెక్కు, చెంక, చెంప అనఁగా కపోలము పేర్లు. దాళువ, దవుడ, దౌడ అన తాలువు పేర్లు.

గీ. పణఁతనా పడఁతియు బహువచనమందు
కటమరలునాఁగ హనువౌను; గద్దువయన
వెలసె చుబుకంబు; చెలిమెయు సెలవి సృక్వ
మౌను; పలు పల్లు రదనాఖ్యలౌ మురారి. 233

పణఁత, పడఁత, బ॥ కటమరలు, అనఁగా హనువు పేర్లు. గద్దువయన చుబుకము పేరు. చెలిమె, సెలవి అన సృక్వము పేర్లు. పలు, పల్లు అన రదము పేర్లు.

గీ. నాలికయు నాలుకయు నాల్క నాఁగ జిహ్వ;
నొసలు నుదురన ఫాలాఖ్యలెసఁగె; చూడ్కి
కన్ను కన్గొను నేత్రమౌ; కంచెరయును
రెప్ప ఱెప్పయు పక్ష్మాఖ్యలొప్పె శౌరి. 234

నాలిక, నాలుక, నాల్క అన జిహ్వకు పేర్లు. నొసలు, నుదురు అన ఫాలము పేర్లు. చూడికి, కన్ను, కను, కన్ అన నేత్రము పేర్లు. కంచెర, రెప్ప, ఱెప్ప, అన పక్ష్మము పేర్లు.

గీ. పాప యూబయు తారకాప్రతిమకాఖ్య
తాను; క్రేఁగన్ను కడగన్ను పాంగమౌను;
బొమ్మ బొమయన భ్రూసంజ్ఞబొంచెను; సెర
యనఁ దృగంతర రక్తరేఖాఖ్య శౌరి. 235

పాప, అబ అన తారకలో బింబముల పేర్లు. క్రేఁగన్ను, కడఁగన్ను అన అపాంగము పేర్లు. బొమ్మ, బొమ, అన భ్రూవు పేర్లు. సెర అన కను గ్రుడ్డు రక్తరేఖ పేరు.

క. కనుకలి యన చూపనఁగను
కనుఁబాటన చూడికియనఁ గనుఁబాడనాఁగన్
గనుచూపన చూడ్కి యనన్
దినకర తుహినాంశునేత్ర దృష్టికి పేర్లౌ. 236

కనుకలి, చూపు, కనుఁబాటు, చూడికి, కనుపాడ, కనుచూపు, చూడ్కి అనఁగా దృష్టికి పేర్లు.

గీ. గొంతు గుంతయనఁగ యతగుతనాఁగ
వావికయునాఁగ కంఠకూబరము; వీను

నాఁగ జానుగునాఁ జెవినాఁగ లాఁగ
రియన కర్ణంబునకుఁ బేళ్లు కృష్ణవర్ణ. 237

గొంతుపంత, అతిసంటు, వాలిక, అనఁగ కంఠకూబరముపేళ్లు. కిప్ప, జానుగు, చెవి, లాఁగరి అనఁగా కర్ణముపేళ్లు.

గీ. గిల్లచూపును మెల్లయు గిల్లకన్ను
నాఁగ కేకరమనాను; కణంత కడఁత
యనఁగ భువిని శిరఃపార్శ్వమనాను;
కొలికి నాసికాగ్ర భాగాక్షకోణంబు పేరు. 238

గిల్లచూపు, మెల్ల, గిల్లకన్ను అనఁగా కేకరముపేళ్లు. కణంత, కడఁత అన శిరఃపార్శ్వముపేళ్లు. కొలికి అనఁగా నేత్రాగ్రముపేరు.

క. నెఱికలనఁగ నెరులనఁగను
వెఱికలనం గురులనంగ వెండ్రుకలనఁగన్
వఱలెను కేశాభిఖ్యలు
కఱివేలుప! బొచ్చు నింద్యగతరోమాళిన్. 239

నెఱికలు. నెరులు, వెఱికలు, కురులు, వెండ్రుకలు అన కేశముల పేళ్లు. బొచ్చు, అన నింద్యగతమైన రోమాళిపేళ్లు.

గీ. కురులు ముంగురులనఁగను కుంతలములు
వేనలియు కీలుజడనాఁగ వేణిసంజ్ఞ;
కూఁకటియు పిల్లజుట్టన కాకపక్ష
సంజ్ఞ; సిక సిగనా శిఖసంజ్ఞ శౌరి. 240

కురులు, ముంగురులు, అన కుంతలముల పేళ్లు. వేనలి, కీల్జడ అన వేణిపేళ్లు. కూఁకటి పిల్లజుట్టుఅన కాకపక్షము పేళ్లు. సిక, సిగ అన శిఖపేళ్లు.

గీ. కొప్పు వెద వేనలియు మూల క్రొవ్వెదయును
తుఱుమునాఁగను కబరిమైవఱలె; నూనె
ముడియు వేనలినాఁగ క్రొమ్ముడియు కీలు
గంటనఁగను ధమ్మిల్లమా కమలనాభ. 241

కొప్పు, వెద, వేనలి, మూల, క్రొవ్వెద, తుఱుము అనఁగా కబరి పేర్లు. నూనెముడి, వేనలి, క్రొమ్ముడి, కీలుగంటు అనఁగా ధమ్మిల్లము పేర్లు.

క. తొడవన నగయన సొమ్మన
తొడువన రవణంబనంగ తొడ్వన్న మఱిం
దొడగన దొడ్గన తెలుఁగున
నడరెను భూషణముపేళ్లు హాటకచేలా. 242

తొడవు, నగ, సొమ్ము, తొడువు, రవణము, తొడ్వు, తొడగు, తొడ్గు అనఁగా భూషణము పేర్లు.

చ. కులగిరిధీర! కమ్మలును కుంబెనకుచ్చులు బావిలీలు జం
పులు బవిరెల్ మఱిన్ పడగపూలును పంజులకమ్మ లింక గొ
లుసులు జుమికీలు ప్రోగులును లోలకులోంపులు గుమ్మతీలుపం
జులు మఱికమ్మపంజులన సొంపుగ స్త్రీతతి కర్ణభూషలా.

కమ్మలు, కుంబెనకుచ్చులు, బావిలీలు, జంపులు, బవిరెలు, పడగపూలు, పంజులకమ్మలు, గొలుసులు, జుమికీలు, ప్రోగులు, లోలకులు లోంపులు, గుమ్మతీలు, పంజులు, కమ్మపంజులు అన స్త్రీ కర్ణభూషావిశేషముల పేళ్లు.

క. ధర నాసాభూషణము
క్కఱయన ముక్కఱయు ముక్కుకమ్మియనఁగ ముం.

గరయన ముకుపోగన బే
సరియన నామాళిజెల్లె సారసనాభా. 244

ముక్కెర, ముక్కెఱ, ముక్కుకమ్మి, ముంగర, ముకుపోగు, బేసరి అన నాసాభూషణము పేర్లు,

క. నెలవంక సూనకము జా
బిలిపువు చిన్నిపువును జడబిల రాకిడియుం
దలమానికంబనంగను
వెలసె శిరోభూషణాలి భేదములగుచున్. 245

నెలవంక, సూనకము, జాబిలిపువు, చిన్నపువు, జడబిల్ల, రాకిడి, తలమానికము, అన వేర్వేరశిరోభూషణముల పేర్లు.

క. ముంగాముురారి కడియము
ముంగాముురువును మురుగును ముంగాముురమున్
ముంగమురము సూడిగమును
ముంగమురా మనగ కటక మునకునభిఖ్యల్. 245

ముంగాముురారి, కడియము, ముంగాముురువు, మురుగు, ముంగాముురము, ముంగమురము, సూడిగము, ముంగమురాము అనగా కటకమునకు పేర్లు

గీ. బాజుబందులు పోంచీలు పట్టెలు మురి
డీగొలుసులు నొత్తులును పాటీలు బొద్దు
లనగ హస్తభూషణములౌ; నంగుళీయ
మునకునుంగ్రంబు నుంగరమును సికాయు. 247

బాజుబందులు, పోంచీలు, పట్టెలు, మురిడీగొలుసులు, ఒత్తులు పాటీలు, బొద్దులు అన హస్తభూషణవిశేషములు ఉంగ్రము, ఉంగరము, సికా, అనగా అంగుళీకము పేర్లు.

ఆ వె. అందెపాగడంబు నందియ పాడగ
మనఁగ నూపురాఖ్యలౌను; జంగి
యలునసంగ బరుజులన గజ్జెలన కింకి
ణికి సభిఖ్యలౌను నీలదేహ. 248

అందె, పాగడము, అందియ, పాడగ అన నూపురముపేళ్ళు. జంకి యలు, బరుజులు, గజ్జెలు అనఁగా కింకిణినామములు

ఆ.వె. సరిగె యెత్తు మాలె సరి సోఁగు క్రోవయు
దండ తావళంబు దామమగును;
తాళి పతక మింక తాళీయనంగను
తరళమునకు పేళ్లు పరమపురుష. 249

సరిగె, ఎత్తు, మాలె, సరి, సోఁగు, క్రోవ, దండ, తావళము అన దామముపేళ్ళు. తాళి, పతకము, తాళీ లన తరళముపేళ్ళు.

గీ. చెంపసరి గాడసరమును చెంపకల్లి
నాఁగ పడగలదండ బన్నసరి ముత్తె
సరియు హారవిశేషముల్; విరిసరియును
మాలె దండయునాఁ బుష్పమాల శౌరి. 250

చెంపసరి, గాడసరి, చెంపకల్లి, పడగలదండ, బన్నసరి, ముత్తెసరి అనఁగా హారవిశేషములపేళ్ళు. విరిసరి, మాలె, దండ అన పుష్పమాలిక పేళ్ళు.

క. నేవడమన మానికపుం
దావడమన బన్నసరము నా గుబ్బసరిన్
నేవళమన నేహారము
నా విలసిల్లె మణిహారనామములు హరీ. 251

సేవటము, మానికపుఁబావడము, బన్నసరము, సుబ్బసరి, సేసకము సేహారము అన మణిహారము పేళ్ళు.

క. సరిపణి యుత్తండములుఁ గ
సరిపెణ యును నానుక్రోవి సరడు సరిపణీ
పరగెను భువి తెలుఁగున హార
మున గళభూషావిశేషముల నామంబుల్. 252

సరిపణి, ఉత్తండములు, సరిపెణ, నానుక్రోవి, సరడు, సరిపణీ అనఁగా కంఠభూషణవిశేషముల పేళ్ళు.

క. కరెనుత యొడ్డాణమున క
మరు నొడిదారంబు తీఁగ మఱి మొలనూల్క
మ్మరు మొలకట్టొడికట్టన
హరువుగ తెలుఁగునను మేఖలాఖ్యలు ధరణిన్. 253

ఒడ్డాణము, కమరు, ఒడిదారము, తీఁగ, మొలనూలు, కమ్మరు, మొలకట్టు, ఒడికట్టు అన మేఖల పేళ్ళు.

గీ. హావణికయనంగ కైసేతయనఁగ నొప్పి
దంబు సింగారము కయిసేతయన పాట
న యన హావణింపు నాఁగను నలిననాభ
యాంధ్రమున నలంకారాఖ్య లలరె భువిని. 254

హావణిక, కైసేత, ఒప్పిదము, సింగారము, కయిసేత, పాటన, హావణింపు అనఁగా అలంకారమునకు పేళ్ళు.

ఉ. పావడ బట్ట కప్పడము వల్వము పుట్టము దుస్తు పాత హే
రావళి చీర సేరవళి ప్రాతయు వీణము కోక వల్వ సే

లా వలువంబు వల్వ్వా కపళంబును సుగ్గడితం బనంగ పే
ల్లొ వనజాక్ష వస్త్రమున కాంధ్ర పదావళి నిద్ధరాస్థలిన్. 255

పావడ, బట్ట, కప్పడము, వల్వము, పుట్టము, దుస్తు, పాత, పేరా
వళి, చీర, పేరవళి, ప్రాంత, వీణము, రూ॥ వీణాము, కోక, వల్వ, సేలా,
వలువము, వల్వ, కపళము, సుగ్గడితము అనఁగా వస్త్రముల పేళ్లు.

క. జరి జలతారును తగటీ
జరబాజును తగటు తగటి జంటీయు జకీ
బురుసా మాతాబి సరిగ
జరతయు నాఁ గనక తంతు సంజ్ఞలు శౌరీ. 256

జరి, జలతారు, తగటీ, జరబాజు, తగటు, తగటి, జంటీ, జకీ,
బురుసా, మాతాబి, సరిగ, జరత అనఁగా కనకతంతువు పేళ్ళు.

సీ. కుతినీయు పట్టును బతినీ యనంగ కౌ
శేయ నామంబులై చెలఁగె; తాపి
తా వెలిపట్టును తాపిత నా శ్వేత
కౌశేయమున కభిఖ్యలగు; నెజ్జి
పట్టు బుర్నా రక్తవర్ణకౌశేయమై
తనరెను పేళ్లు; మాందాళి మాద
ళంబును మాదావళంబు మాదావళి
పచ్చపట్టన పీతవర్ణచీన
గీ. చేలమగు; సకలాతును సాలువయును
సాలు సాల్వాయు శాంతవాఖ్యాళియాను;
రేటమున రెంటమనఁగను రెంటమనఁగ
ద్వంద్వ తంత్వంబరము పేళ్లు దానవారి. 257

కతినీ, పట్టు, బతినీ అన కౌశేయముపేళ్ళు. తాపితా, వెలిపట్టు, తాపిత అనఁగా శ్వేతకౌశేయముపేళ్ళు. ఎఱ్ఱపట్టు బుర్సా (రూ) బురుసా అనఁగా రక్తకౌశేయముపేళ్ళు. మాంచాళి, మాదళము, మాదావళము, మాదాళి, పచ్చపట్టు అనఁగ పీలకౌశేయముపేళ్లు. సకలాతు, సాలువ, సాలు, సాల్వా, అనఁగా రాంకవముపేర్లు. రేఁటము, గెంటము, రెంటము అనఁగా జమిలినేత ద్వంద్వతంత్వంబరముపేర్లు.

క. కంబళియన గొంగడియన
కంబడియన వెలసెపేళ్లు కంబళమునకుఁ గా
శంబరరిపుజనకా మో
దంబున నేరాజు కనక తంత్వంబరమూ. 258

కంబళి, గొంగడి, కంబడి అనఁగా కంబళముపేర్లు. నేరాజు అనఁగా కనకతంత్వంబరముపేరు.

గీ. దట్టమనఁ గాగరయు నంగదట్టమనఁగ
పావడయన తాబందన పరికిణియని
యనఁగ నెఱికయు చల్లాడమనఁగ నొప్పె
వలిభయుత వలయాకార వస్త్రమునకు. 259

దట్టము, గాగర, అంగదట్టము, పావడ, తాబందు, పరికిణి, నెఱిక, చల్లాడము అనఁగా వలిభయుతవలయాకారవస్త్రమున [లంగా.]కు పేర్లు.

పంచపాదిగీ. చీర దుప్పట్లు కోకయు జేబు జీబు
నాఁగ. స్త్రీబంధనాంబర నామములగు;
కుప్పసము చన్నుకట్టును కువసము చను
గప్పుచన్నులువును రైక కంచెలయును
అఱికి నాఁ గంచుకముపేళ్లు భవవినాశ. 260

చీర, దువ్వలువ, కోక, జేబు, జీబు అన స్త్రీలుధరించువస్త్రముపేర్లు
కుప్పసము, చన్నుగట్టు, కుపసము, చనుగిన్నె, చన్మలువు, రైక, అవిక
అన కంచుకముపేర్లు.

క. వలిపంబన కోకయనఁగ
జిలుగన సాలువమనంగ జిల్గనఁగ మఱి౯
వెలిపంబన వలువయనం
గులపర్వతధర భువిని దుకూలముపేర్లౌ. 261

వలిపము, కోక, జిలుగు, సాలువము, జిల్గు, వెలిపము, వలువ
అనఁగా దుకూలముపేర్లు.

గీ. దుప్పటియు దుప్పటీయన దువ్వలువయు
బైరవాసంబునాఁగ జామారునాఁగ
నౌను సెల్లాయు పోరువయనఁగ దుప్ప
టంబనంగ నుత్తరీయమౌ నంబుజాక్ష. 262

దుప్పటి, దుప్పటీ, దువ్వలువ, బైరవాసము, జామారు, సెల్లా, పో
రువ, దుప్పటము అనఁగా ఉత్తరీయముపేర్లు.

గీ. వసుధ చింగన నిత్యైకవచనమందు
నెఱియు నెఱికయు పింజెనా నిత్యబహువ
చనమునందున కుచ్చెళ్ళు ననఁగ రింగు
లనఁగ వలిభాహ్వయంబులు వనజనాభ. 263

చింగు, నిత్యైకవచనమున నెఱి, నెఱిక, పింజె, నిత్యబహువచనమున
కుచ్చెళ్ళు, రింగులు అనఁగా వలిభముల పేళ్ళు.

గీ. పయఁట పయ్యెఁట పయ్యెద పైఁటక్ష్మపయిఁట
చెలఁగె నంశుకమై; కొంగు చెంగును చెఱఁ

గనఁగ చేలాంచలము; నీవికాఖ్యలౌను
భువి వలపుకీలు గసయుంబు పోఁకముడియు. 264

పయఁట, పయ్యెఁట, పయ్యెద, పైఁట, పయిఁట అన అంశుకము పేర్లు. కొంగు, చెంగు, చెఱఁగు, అన చేలాంచలము పేర్లు. వలపుకీలు, గసయము, పోఁకముడి అనఁగా నీవికి పేర్లు.

గీ. బొట్టు తిలకంబగు; పుదియబొట్టు నూర్ధ్వ
పుండ్రమౌ; మోదమన జలపోత నాఁగ
నౌను జంటీయు స్వర్ణలేప్యంబు లత్తు
కయన పారాణినా నలక్తకము శౌరీ. 265

బొట్టు అనఁగా తిలకము పేరు. పుదియబొట్టు అన ఊర్ధ్వపుండ్రము పేరు. మోదము, జలపోత, జంటీ అనఁగా స్వర్ణలేప్యము (మొలాను) పేర్లు. లత్తుక, పారాణి అన అలక్తకము పేర్లు.

క. పడకయు పానుపు పఱపును
దడిబంబును మెత్త సెజ్జ తలిపంబు మఱిఁ
పడుకయు పక్కయు పఱుపన
నడరెను శయ్యాఖ్యలగుచు నంబుజనాభా. 266

పడక, పానుపు, పఱపు, దడిబము, మెత్త, సెజ్జ, తలిపము, పడుక, పక్క, పఱుపు అన శయ్యకు పేర్లు.

క. అరపయు కంకటి కంగటి
పరియంకము పానుపనఁగ పర్యంకంబౌ;
నరయఁగ మంచము పలకయు
పరగ తెలుఁగునందు స్వల్ప పర్యంకంబౌ 267

అరప, కంకటి, కంగటి, పరియంకము, పానుపు అన పర్యంకముపేర్లు, మంచము, పలక అనఁగా స్వల్పపర్యంకముపేర్లు.

గీ. తేఁడు తెన్నుండు తొన్నుండు తెండు తొంగు
పఁడు పన్నుండు పవళించు పవ్వళించు
పవ్వడించు పరుండును పండుకొనన
వెలసె శయనించుటకు పేళ్లు వేదవేద్య 268

తేఁడు, తెన్నుండు, తొన్నుండు, తెండు, తొంగు, పండు, పన్నుండు పవళించు, పవ్వళించు, పవ్వడించు, పరుండు, పండుకొను అన శయనించుపేర్లు.

క. డేరా గొల్లెన పీడు గు
డారము గూడారమును గుడారును మఱియుఁ
డేరీజ చప్పరము గూ
డారును వేలంబునాఁ బటకుటీరంబా. 269

డేరా, గొల్లెన, పీడు, గుడారము, గూడారము, గుడారు, డేరీజ చప్పరము, గూడారు, వేలము అనఁగా పటకుటీరముపేర్లు.

గీ. పృథ్వి నవగోజ పెన్వీడు పెద్దవేల
మనఁ మహద్దూష్యమౌను; జవనిక గండ
వడము తెరయనఁగా కాండపటమగు; పట
కుడ్యమునకు సరాలియా కోమలాంగ. 270

నవగోజ, పెన్వీడు, పెద్దవేలము అనఁగా మహద్దూష్యముపేర్లు. జవనిక, గండవడము, తెర అనఁగా కాండపటమునకుపేర్లు, సరాలి అన పటకుడ్యముపేరు.

క. వనరుహలోచన యుల్లడ
యనఁగను మేల్కట్టునాఁగ నగు చందువనాఁ
గను చందువా యనఁగ తెలుఁ
గున నుల్లాభంబు పేళ్లు కుంభినివెలసెః. 271

ఉల్లడ, మేలుకట్టు, చందువ, చందువా అనఁగా ఉల్లాభము పేళ్ళు.

క. తలయంపి జీనపటమును
తలాడయును బిల్లదిండు తల్గడ ద్రిండుం
దలగడయు బటువుబిళ్లయు
నలరుచు నుపధానమౌను హాటకచేలా. 272

తలయంపి, జీనపటము, తలాడ, బిల్ల, దిండు, తల్గడ, ద్రిండు
తలగడ, బటువుబిళ్ల, అన ఉపధానము పేళ్లు.

పంచపాదిగీ. ఒఱగుబిల్ల దురాడంబు నొరగు బిల్ల
యొఱగు బాలీసు లోడన నొప్పె మత్త
వారణము పేళ్లు; తెలుఁగునవఱలెను తల
యంపినాఁగను తల్లఁపియన తలాఁపి
యనశిరస్థానమున కాఖ్యలౌను శౌరి. 273

ఒఱగుబిల్ల, దురాడము, ఒరగు,బిల్ల, ఒఱగుబాలీసు, లోడు అనఁగా
మత్తవారణము పేళ్ళు. తలయంపి, తల్లఁపి, తలాఁపి అనఁగ శిర
స్థానమునకు పేళ్ళు.

క. గంబురమును చలియిసుకయు
గంబూరము కప్పురంబు కర్పము సెలయుణ్
గంబూర గంబురాయును
గంబుర కపురంబనంగ కర్పూరంబౌ 274

గంబురము, చలియిసుక, గంబూరము, కప్పురము, క్రపము, నెల, గంబూర, గంబురా, గంబుర, కపురము అన కర్పూరము పేళ్లు.

క. పునుఁగనఁగత్తైనిట్టిగోరజ
మనఁగ మెకపుటామనంగ నగు కస్తురినాఁ
గను జింకపొక్కిలి యనం
గను కస్తూరికిని పేళ్లు కాంచనచేలా. 275

పునుఁగు, ఇట్టిగోరజము, మెకపుటాము, కస్తురి, జింకపొక్కిలి అనఁగా కస్తూరికి పేళ్లు.

గీ. గందము మలాక వేదన చందనంబు;
పచ్చకప్పురమన నెలవత్తినాఁగ
నగును భువి మహాత్కర్పూర; మార్ద్రచూర్ణ
మునకు బగ్గుండినాఁ గులాలనఁగ శౌరి. 276

గందము, మలాక, వేదు అన చందనము పేళ్ళు. పచ్చకప్పురము, నెలవత్తి అనఁగా మహాత్కర్పూరము పేళ్లు. బగ్గుండి, గులాలు అనఁగా ఆర్ద్రచూర్ణమునకు పేళ్ళు.

గీ. అత్తరన కమ్మనూనెనా నత్తరువన
నంబరన తావినూనియయన ప్రబోధ
నంబు; పూనీరు పన్నీరునా హిమాంబు
వౌను; కొడియన దీపశిఖాఖ్య శౌరి. 277

అత్తరు, కమ్మనూనె, అత్తరువు, అంబరు, తావినూనె అన ప్రబోధనము పేళ్లు. పూనీరు, పన్నీరు అన హిమాంబువు పేళ్లు. కొడి అనఁగా దీపశిఖకు పేరు.

క. చెందిరమన చందురమన
సిందురమన చంద్రమనఁగ సిందూరము పెం
పొందెను; పీఁటయనఁగ పే
రొందెను పీఠంబు భువిని యురగశయానా. 278

చెందిరము, చందురము, సిందురము, చంద్రము అనఁగా సిందూరము పేళ్ళు. పీఁట అన పీఠము పేరు.

పంచపాదిగీ. దివియ దిబ్బెంబు దీవియ దివ్వెయు దివె
దివ్య జోతియనంగను దీపమౌ; జ
వాజినా జవాదియన జవ్వాజినా జ
వాదు జవ్వాదు నాఁగ జవ్వాదియనఁగ
సంకుమదమున కాఖ్యలౌ సారసాక్ష. 279

దివియ, దిబ్బెము, దీవియ, దివ్వె, దివె, దివ్య, జోతి అన దీపము పేళ్లు. జవాజి, జవాది, జవ్వాజి, జవాదు, జవ్వాదు, జవ్వాది అన సంకుమదము పేళ్లు.

గీ. తమ్మలపుటాకు తెలనాకు తములపాకు
కమ్మరాకును తెల్లనా కిమ్ముషిఁనగు
నాగవల్లీదళంబు; తద్భాగబంధ
నమగు మావటమన మోద నాఁగ శౌరి. 280

తమ్మలపుటాకు, తెలనాకు, తములపాకు, కమ్మరాకు, తెల్లనాకు అన నాగవల్లీదళము పేళ్లు. మావటము, మోద అన తద్భాగబంధనము (తములపాకులకట్ట) పేళ్లు.

గీ. అడపమన సంబెళయన వక్కాకుసంచి
యనఁగ తాంబూలపటపేటికౌను; తబుకు

కంపెయును జాలవల్లిక కుంపెయనఁగ
నలరె తాంబూలపాత్రాఖ్యలగుచు శౌరి. 281

అడపము, సంబెళ, వక్కాకుసంచి అనఁగ తాంబూలపటపేటికకు పేర్లు.
తబుకు, కంపె, జాలవల్లిక, కుంపె అన తాంబూల పాత్రికునకుఁ బేర్లు.

క. విడెమును తములము వీడెము
విడియంబును తమ్ములంబు విడ్యము మఱిఁ దా
విడియయు వీడ్యము వక్కా
కడరెను తాంబూలమునకు నాఖ్యలు శౌరీ. 282

విడెము, తములము, వీడెము, విడియము, తమ్ములము, విడ్యము, విడియ, వీడ్యము, వక్కాకు అన తాంబూలము పేర్లు.

గీ. పృథ్వి తాంబూలవస్తు కల్పితగుళికకు
కవిరి యన కైరవడియన గల్గెపేళ్లు;
పడిగమును తమ్మపడిగంబు పడిగ తమ్మ
తసుకు కాళంజినాఁగ పతద్గ్రహణము. 283

కవిరి, కైరవడి అనఁగా తాంబూలవస్తుకల్పితగుళికకు పేర్లు. పడిగము, తమ్మపడిగము, పడిగ, తమ్మతసుకు, కాళంజి అన పతద్గ్రహణము పేర్లు.

క. ఆకొత్తన నడకొత్తన
పోఁకొత్తన శంకులయగు; భువి వక్కయనన్
పోఁకయు వాసారంబన
శ్రీకర పూగంబుపేళ్లు చెలఁగె తెనుఁగునన్ 284

ఆకొత్తు, అడకొత్తు, పోకొత్తు అన శంకులకు పేర్లు. వక్క, పోఁక, వాసారము అనఁగ పూగమునకు పేర్లు.

క. జోటిపని పైసరంబును
కూటమి మసకంబు రంతు గూడ రతికిపే
ళ్లౌటయు; మగపాడియు పై
కూటమి మగలాగనఁగ నగు నుపరతి కిలన్. 285

జోటిపని, పైసరము, కూటమి, మసకము, రంతు అన రతిక్రియకు పేర్లు మగపాడి, పైకూటమి, మగలాగు అన ఉపరతికి పేర్లు.

పంచపాది గీ. మసకఁగొను గండాడన మహి రమించు
పేళ్లు; వెలిగ్రుక్క లోఁగ్రుక్క నెలసె మణిత
మగుచు; మసకంబునాఁ గెలవన రతేచ్ఛ;
పొలయలుక నెయ్యపుటలుక చెలఁగె బ్రణయ
కోపమునకు నభిఖ్యలు కోమలాంగ. 286

మసకఁగొను, గండాడు అన రమించు పేర్లు. వెలిగ్రుక్క, లోఁగ్రుక్క అన మణితము పేర్లు. మసకము, కెలవు అన రతేచ్ఛకు పేర్లు. పొలయలుక, నెయ్యపుటలుక అనఁగా ప్రణయకోపము పేర్లు.

గీ. అలముకొను కౌఁగిలింతన నలము కవుఁగి
లింపునాఁగను పేళ్లు నాలింగనమున
కగును; పలుకెంపు పల్లొత్తునఁగ తెలుఁగు
నందు దంతక్షతంబున కాఖ్యలుహరి. 287

అలముకొను, కౌఁగిలింత, అలము, కవుఁగిలింపు అన ఆలింగనము పేర్లు. పలుకెంపు, పల్లొత్తు అనఁగా దంతక్షతమునకు పేర్లు.

క. నెలకూనలు చిట్టంటులు
నెలవంకలు గోటిగిట్లు నెలపిల్లలు జా

బిలిబుడుతలు గోటిచెనకు
లలరె నఖక్షతములగుచు నమరనుతాంధ్రీ 288

నెలకూనలు, చిట్టంటులు, నెలవంకలు, గోటిగీట్లు, నెలపిల్లలు, జాబిలిబుడుతలు, గోటిచెనకులు అనఁగా నఖక్షతముల పేర్లు.

గీ. అదుమునా నొక్కునాఁగ నొత్తనఁగ పీడ
నాఖ్యలగు; గీఱు అక్కన నగును రేఖ
పేళ్లతోఁగూడి కుండలిభిత్తురంగ
వసుధ నాంధ్రమున మనుష్యవర్గు ముగిసె. 289

అదుము, నొక్కు, ఒత్తు అనఁగా పీడనమునకు పేర్లు. గీఱు, అక్కు—అన రేఖకు పేర్లు.

---

## బ్రహ్మవర్గు

క. వంగడమున కొలమనఁగను
వంగసమున సంతునాఁగ వంశము పేళ్లౌ;
రంగ ద్రాక్షసరాజవి
భంగా బాఁపన యనంగ బ్రాహ్మణకులమౌ. 290

వంగడము, కొలము, వంగసము, సంతు అనఁగ వంశము పేర్లు. బాఁపన అన బ్రాహ్మణకులము పేరు.

క. బాఁపనివాఁ డిరుపుట్టువు
బాఁపనుఁడును నేలవేల్పు పాఱుఁడును మహిశే

బాఁపనయు పాఱువాఁడన
బాఁపఁడు బొమ్మఁడననౌను బ్రాహ్మణుఁడు హరీ.

బాఁపనివాఁడు, ఇరుపుట్టువు. బాఁపనుఁడు, నేలవేల్పు, పాఱుఁడు బాఁపనయు, పాఱువాఁడు, బాఁపఁడు, బొమ్మఁడు అన బ్రాహ్మణునకుఁ బేర్లు

గీ. బాఁపతయు పాఱుటక్కయు బాఁపనక్క
పాఱుత యనంగ బ్రాహ్మణభామపేళ్లు;
జన్నమన గంగియన యజ్ఞసంజ్ఞ; హోమ
మునకు వేలమియగు; యాజకునకు నొజ్జ. 292

బాఁపత, పాఱుటక్క, బాఁపనక్క, పాఱుత అన బ్రాహ్మణస్త్రీ పేర్లు. జన్నము, గంగి అన యజ్ఞముపేర్లు. వేలమి అన హోమముపేరు. ఒజ్జ అన యాజకునకు పేరు.

క. ఆపోసనమని యనఁగా
నాపోసానమన ధరణి నాపోశనమగు;
నాపైన వారఁబట్టన
నాపోశించుటకుపేరు హాటకచేలా. 293

ఆపోసనము, ఆపోసానము అన ఆపోశనముపేర్లు. వారఁబట్టు అనఁగా ఆపోశించుపేరు.

గీ. పృథ్వి జన్నపుటొజ్జనా ఋత్విగాఖ్య
యలరె; యిగిరిక యివిరికయన హవిస్సు;
చిదుగు వేలమి కట్టెనాఁ జెలఁగి సమిధ
లమ్యె; సోమాసియన సోమయాజిపేరు. 294

జన్నపుటొజ్జ అన ఋత్విక్కునిపేరు. ఇగిరిక, ఇవిరిక అన హవిస్సు పేర్లు. చిదుగు వేలిమి, కట్టె అన సమిధపేర్లు. సోమాసి అన సోమయాజి పేరు.

గీ. ఒజ్జనా నొజ్జబంతినా నోజబంతి
యనఁగఁ జదువులయ్యయు నోజయనఁగ నాంధ్ర
మున నుపాధ్యాయులకు పేళ్ళదనరె; చట్టు
నాఁగ శిష్యునకాఖ్యయౌ నాగళయన 295

ఒజ్జ, ఒజ్జబంతి, ఓజబంతి, చదువులయ్య, ఓజ అనఁగా ఉపాధ్యాయులకు పేళ్ళు. చట్టు అన శిష్యునకుఁ బేరు.

గీ. వేల్పుకై సేతనా పూజపేరు; దబ్బ
యనఁగ దర్భాఖ్యయగును; నోమనఁ బతమన
వ్రతమగును; తబమనఁగ తపస్సు తెనుఁగు
నను; వడుగు వడువన నుపనయనమగును. 296

వేల్పుకై సేత, అన పూజపేరు. దబ్బ అన దర్భకుపేరు. నోము, బతము అన వ్రతము పేళ్లు. తబము అన తపస్సుపేరు. వడుగు వడుపు అన ఉపనయనము పేళ్ళు.

క. చాగమునాఁ దేగమునా
నీగియు పుడుకన నొసఁగన నీవియు నొసవుగ్
నాఁగ తెగువయును తెంపన
త్యాగముపేళ్ళగు; నెఱియన నాచారంబౌ 297

చాగము, తేగము, ఈగి, పుడుకు, ఒసఁగు, ఈవి, ఒసవు, తెగువ తెంపు అన త్యాగము పేళ్లు. నెఱి అన ఆచారము పేరు.

గీ. బాసవాలును రుషి నిరాహారి జోగి
తపసి జడదారియన ఋషితనరె; జోడ
నాఁగ కావిత్రాల్పనఁగ సన్న్యాసియనఁగ
నౌను విన్నాణియన పేళ్లు యతికిఁజెల్లు. 298

బాసవాలు, రుసి, నిరాబారి, జోగి, తపసి, జడదారి, అన ఋషికిఁ పేర్లు. బోడ, కావితాల్పు, సన్నాసి, నిన్నాణి అనఁగా యతికిఁ బేళ్ళు.

క. వడుగును వడువు లెడుపుదా
ల్పుడు మెణకరి బొమ్మచారి ముంజీఁడు మరిన్
వడుగఁడును గోచిబాఁపఁడు
నడరెను భువిబ్రహ్మచారి కాఖ్యలయి హరీ 299

వడుగు, వడువు, లెడుపుదాల్పు, మెణకరి, బొమ్మచారి, ముంజీడు, వడుగడు, గోచిబాఁపఁడు అనఁగా బ్రహ్మచారికిఁ బేళ్ళు.

గీ. గేస్తునాఁ గాఁపనంగ గృహస్థు పేళ్లు;
లంబి లంబీయు లెంబి కుటుంబమౌను;
ప్రాచితమున ప్రాయశ్చిత్తభావమౌను;
బొజియచూలినాఁ వాల్మీకివఱలె శౌరి. 300

గేస్తు, కాఁపు, అనగృహస్థుపేళ్ళు. లంబి, లంబీ, లెంబి అన కుటుంబము పేళ్ళు. ప్రాచితము అన ప్రాయశ్చిత్తముపేరు. బొజియచూలి అనవాల్మీకులపేరు.

గీ. జడయు తిరినాఁగ జటపేళ్లు; జడలచుట్టు
చోళియమును చోళ్ళై మనఁగను తెఁగునందు
నిలఁ జెలఁగె జటాశిఖపేళ్ళు; నిఱ్ఱిత్రోలు
నాఁగ కృష్ణాజినముపేరు నలిననాభ. 301

జడ, తిరి అన జటకుఁ బేళ్ళు. జడలచుట్టు, చోళియము, చోళ్ళైము అనఁగా జటాశిఖకుఁ బేళ్ళు. ఇఱ్ఱిత్రోలు అన కృష్ణాజినము పేరు.

గీ. కక్షపాలకు కకపాల కక్కుపాల;
దండమునకు లాతాము లాతము; కమండ

లంబునకను జారీయన డంబుమీఁదె;
క్షౌరమునకు కొఱుగు కోఁగు శ్యామలాంగ 302

కకపాల, కకౄపాల అన కక్షపాల పేళ్ళు లాతాము లాతము, అన దండము పేళ్ళు. జారీ అన కమండలము పేరు. కొఱుగు కోఁగు అన క్షౌరము నకుఁ బేళ్ళు

క. చెయిదంబన చెద్దియనం
జెయిదియు పనిచెయ్వనంగ చెద్దంబనఁగన్
జెయువని యనఁగా మానిహృ
దయ వికచాంబురుహషట్పదా కర్మాఖ్యల్ 303

చెయిదము, చెద్ది, చెయిది, పని, చెయ్వు, చెయము, చెయువు అనఁగా కర్మ పేళ్ళు.

గీ. జందియము జన్నిదంబును జందెమనఁగ
జంధ్యమునకు నామంబులౌ; జడకమనఁగ
బొంతనాఁగను కుచ్చలిగంత నాఁగ
కంథకు నభిఖ్యలౌ నీలకంధరాంగ. 304,

జందియము, జన్నిదము, జందెము, అన జంధ్యము పేళ్లు, జడకము బొంత, కుచ్చలి, గంత అన కంథకుఁ బేళ్ళు

గీ సోటముంజియు గోణంబు పుట్టగోఁచి
గోవణంబును గోణాము గోసి గోఁచి
బొట్టమును కచ్చడంబును పొట్టము తడ
పనఁగ కౌపీనమున కాఖ్యలౌను శౌరి 305

పోటముంజి, గోణము, పుట్టగోఁచి, గోవణము' గోణాము, గోసి, గోఁచి, బొట్టము. కచ్చడము, పొట్టము, తడపు అన కౌపీనము పేళ్ళు

గీ. గాస మెఱ యారగింపును గాఁతి తిండి
యన నాహారమున కాఖ్యలయ్యె; నిలియు
నిట్టు నిష్పస్తు సంకుసు నిట్రు మఱి యు
పాసమన పస్తనా నుపవాసమాను. 306

గాసము, ఎర, ఆరగింపు, గాతి, తిండి అన ఆహారముపేర్లు. ఇలి నిట్టు,నిష్పస్తు, నుంకు, నిట్రు, ఉపాసము, పస్తు అన ఉపవాసము పేర్లు.

గీ. ఆకలియన గొదయన గ నంగదయన
క్షుధకు నాఖ్యలగును; వటించుటన నుపవ
సించుటకు పేరు; నాకఁలిసేసెన నాఁక
లిగొనె నాఁకొనె నాఁగ క్షుధగొను పేళ్లు 307

ఆకలి, గొద, అంగద అనఁగా క్షుధకుఁ బేర్లు. వటించు అన ఉప వసించుట పేరు. ఆఁకలిసేసె, ఆఁకలిగొనె, ఆఁకొనె అనఁగా క్షుదగొను పేర్లు

గీ. దప్పి దగ దూప నీర్వట్టు దప్పి నీరు
వట్టు దప్పిక యనఁగ పిపాసయాను;
దూపటిల్లన దూపించు దూపిలునన
దప్పిగొనన దాహముగొను టొప్ప శౌరి. 308

దప్పి, దగ, దూప, నీర్వట్టు దప్పి నీరుపట్టు, దప్పిక అన పిపాసను పేర్లు. దూపటిల్లు, దూపించు, దూపిలు, దప్పిగొను అన దాహముగొను పేర్లు.

గీ. పెండ్లియన చెట్టబట్టన పెండిలియన
దనరె నుద్వాహమునకును; తాలిబొట్టు
నాఁగ మినుకన మూసకనాఁగ తాలి
యనఁగ మంగళసూత్రమౌ నసురవైరి. 309

పెండ్లి, పెట్టుబట్టు, పెండిలి అనఁగా వివాహమునకు పేళ్లు. తాలిబొట్టు మినపు, మాసిక, తాలి అనఁగా మంగళసూత్రము పేళ్లు.

గీ. ఆమెతయు విందనఁగ బువ్వమనఁగ బంతి
నా వివాహబంధుభోజనంబు పేళ్లు;
ప్రాకెనయును బ్రాకెన్నయు పాకెనయు న
నఁగ వివాహత్రిదిన భోజనంబుపేళ్లు 310

ఆమెత, విందు, బువ్వము, బంతి అన వివాహాదులలో జరుగు బంధు భోజనము. ప్రాకెన, ప్రాకెన్న, పాకెన అనవివాహమున త్రిదినభోజనము పేళ్లు.

గీ. పూసఁగె పెనువిందునాఁ హరిబువ్వమనఁగ
భువి వివాహ చతుర్దిన భోజనంబు
పేళ్లు; సుంకువ యోలినాఁ బేళ్లు కన్య
కార్థ శుల్కంబునకుఁజెల్లు హరిమురారి. 311

పెనువిందు, హరిబువ్వము అన వివాహ చతుర్దిన భోజనము పేళ్లు. సుంకువ, ఓలి, అన కన్యాశుల్కము పేళ్లు.

క. బికిరాలమారియనఁగను
బికారియు బికాసియనఁగ భిక్షుకుఁడా భి
క్షుకు జోగ్గు నాయవారము
బికిరము జోగు తిరిపమన బేళ్ళగు శౌరీ. 312

బికిరాలమారి, బికారి, బికాసి, అనఁగబిక్షుకుని పేళ్లు. జోగ్గు, ఆయవారము, బికిరము, జోగు, తిరిపము అనఁగా బిక్షుకు పేళ్లు.

సీ. జోహారువనఁగను జోహారవంగ జో
హారువనంగ కోపనఁగ నొరిగ

యనఁగ జోతంబు జోహారన జోతయన
గను జోతామన దండమనఁగ మ్రొక్క
డనఁగ టెంకణమని యనఁగ జేజేయన
మొక్కనఁగను కేలుమొగ్గనాఁగ
కై మోడుపన నమస్కారంబునకు బేళ్లు;
చెంగనాల్ గొబ్బళ్ళు చిన్నపువులు

గీ. కేకిసలు గిడిగిల్లు డింగిల్లును కయి
చాపులును కేలుదోయిల్లు చాగిలింత
లేటికోళ్లెఱఁగుళ్ళన నిల నమస్సు
భేదమునకు నభిఖ్యలౌ వేదవేద్య! 313

జోహారువు, జోహారు, జొహారువు, కోపు, ఒరగ, జోతము, జోహారు జోత, జోతాము, దండము, మ్రొక్కుడు, టెంకణము, జేజే, మ్రొక్క, కేలుమొగ్గ అనఁగా నమస్కారమునకుఁ బేర్లు. చెంగనాలు, గొబ్బిళ్లు, చిన్నిపువులు, కేకిసలు, గిడిగిల్లు, డింగిల్లు, కయిచాపులు, కేలుదోయిళ్లు, చాగిలింతలు, ఏటికోళ్లు, ఎరగుళ్లు, అనఁగ నమస్కారవిశేషముల పేరులు.

గీ. ఎఱఁగనఁగ మ్రొక్కనియనఁగ నెఱఁగనంగ
నగు నమస్కరించుటకాఖ్యలాంధ్రమునను
బాపనకులపు చేరువపల్కులుగల
బ్రహ్మవర్గు ముగిసె స్వర్గపాలపతీ. 314

ఎరఁగు, మ్రొక్కు, ఎఱఁగు అనఁగా నమస్కరించుటపేర్లు.

బ్రహ్మవర్గు ముగిసెను.

---

# క్షత్రియవర్గ

సీ. అరసు దేవర యొడయఁడు సామి యేలిక
యొడయుఁడు ఱేఁడు రాయఁడును జియ్య
యెకిమీఁడు పాదుసా యేలినవాఁడును
పుడమిఱేఁడును మన్నియఁడును రావు
మన్నీఁడు మన్నెఁడు మన్నెకాఁడును దొర
నేలతాలుపు దణి నేలఱేఁడు
నాయఁడు మన్నియ నాయకుఁడును పాదు
సాహి యనఁగ రాజసంజ్ఞలు; పబు
గీ. వును వతారి వశర సముద్ధునకు; మణివ
కాఁడునా పబువన నధికారి తెలుఁగు
నందు; రారాజు రాఱేఁడనంగ చక్ర
వర్తి కలరెను నామాళి వాసుదేవ. . 315

ఆరసు, దేవర, ఒడయఁడు. సామి, ఏలిక, ఒడయుఁడు, ఱేఁడు, రాయఁడు, జియ్య, ఎకిమీఁడు. పాదుసా, ఏలినవాఁడు. పుడమిఱేఁడు, మన్నియఁడు, రావు, మన్నీఁడు, మన్నెఁడు, మన్నెకాఁడు, దొర, నేలతాలుపు, దణి, నేలఱేఁడు. నాయఁడు మన్నియ, నాయకుఁడు, పాదుసాహి, అనఁగా రాజుపేర్లు. పబువు, వతాడి, వశర అన సముద్ధునిపేర్లు. మణివకాఁడు, పబువుఅనఁగా అధికారిపేర్లు. రారాజు, రాఱేఁడుఅనఁగ చక్రవర్తికిపేర్లు

గీ. పుడమి గొంతి కుంతియగును; వడముడి వలి
మొలక తోఁ బేటిబొజ్జ భీమునకుఁ జెల్లె;

కత్ఱి వివ్వచ్చు క్రీడియు కవ్వడియన
ఫల్గునుఁడు; ద్రోవదియును ద్రౌపది మురారి. 316

గొంతి అన కుంతికి పేరు. వడముడి, వలిమొనక, తోఁడేటిబొజ్జ, అనఁగా భీమునికి పేర్లు. కత్ఱి, వివ్వచ్చు, క్రీడి, కవ్వడి, అనఁగా అర్జునుని పేర్లు. ద్రోవది అన ద్రౌపదికిఁ బేరు

క. చనువన నాయకరంబన
మణిగము పార్పత్తెమనఁగ మన్నెఱికమనన్
మణీవంబు పారుపత్తెం
బనఁగా నధికారమునకు నాఖ్యలు శౌరీ. 317

చనువు, నాయకరము, మణిగము, పార్పత్తెము, మన్నెఱికము, మణీవము, పారుపత్తెము అనఁగా అధికారమునకుఁ బేర్లు

సీ. రాచయనఁగను రానాఁగ రాజసంజ్ఞ;
బుజముపుట్టువు నాఁ రాచపుట్టువనఁగ
రాచవాఁడన క్షత్రియవ్రాతము; తగ
వఱియు తీర్పరి న్యాయాధిపతికి పేర్లు. 318

రాచ, రా అన రాజసంజ్ఞకుఁ బేర్లు. బుజముపుట్టువు, రాచపుట్టువు రాచవాఁడు అన క్షత్రియునిఁ బేర్లు. తగవరి, తీర్పరి అన న్యాయాధిపతిఁ బేర్లు

క. ఏలుబడి యేలుటయునన
పాలనమునకాఖ్యలౌను; పాలించుటకా
నేలుకొను నేలునఁ మని
పాలితపద! యొజ్జనాఁగ పౌరోహితుఁడా 319

ఏలుబడి, ఏలుట అనఁగా పాలనమునకుఁ బేర్లు. ఏలుకొను, ఏలు అనగా పాలించుటకుఁ బేర్లు. ఒజ్జ అన పౌరోహితుని పేరు.

క. పెగడయన మ్మంతిరియన
 ప్రెగడయు హేజీబనంగ ప్రెగ్గడయనఁగా
 నగు మంతన ప్రెవడయనఁ
 నగరాద్ధర! ముఖ్యమంత్రి నామంబులగుఁ 320

పెగడ, మంతిరి, ప్రెగడ, హేజీబు, ప్రెగ్గడ, మంతు, ప్రెవడ అన మంత్రికిఁ బేర్లు,

గీ. మండెమన మాండెమనఁగను మండలాధి
 పతి ధరామండలము; పిడివాటునాఁగ
 నగు నొడంబడికయునాఁగ నగును రాజ
 శాసనమున కభిఖ్యలు శ్యామలాంగ 321

మండెము, మాండెము అనఁగా మండలాధిపతి దేశమునకుఁ బేర్లు. పిడివాటు, ఒడంబడిక అనఁగా రాజశాసనమునకుఁ బేర్లు.

గీ. ధర దణాపెద్ద దళవాయి దళవరి గమి
 కాఁడు దడవాయి చేరువకాఁడును పడ
 వాలు మొనకాఁడు దొరయు పడాలును దడ
 వరి దణాయఁడు సేనాధిపతికిఁ బేళ్లు. 322

దణాపెద్ద, దళవాయి, దళవరి, గమికాఁడు, దడవాయి, చేరువకాఁడు, పడవాలు, మొనకాఁడు, దొర, పడాలు, దడవరి, దణాయఁడు అన సేనాధిపతికిఁ బేర్లు.

గీ. అవని కటుక కట్టుక నకీబనఁగ నిత్య
 బహువచనమున కోలలవారనంగ
 నగును వేత్రహస్తులు; ప్రతీహారుఁడగును
 గొల్ల పడిహారి పణిహారి కోమలాంగ. 323

కటుక, కట్టుక, నకీబు ని॥ బ॥ కోలలవారు అన వేత్రహస్తునిఁ పేర్లు. గొల్ల, పడిహారి, పణిహారి అనఁగా ప్రతీహారుని పేర్లు.

గీ. లేఁక గుండఁడు బోడిక లెంక బంటు
వరవుఁడును డింగరీఁడన భటునికాహ్వ
యంబులొప్పెను; బానిసీఁడనఁగను పడి
గాపునా సేవకుని పేళ్లు గాఁగలోల 324

లేఁక, గుండఁడు, బోడిక, లెంక, బంటు, వరవుఁడు, డింగరీఁడు అనభటుని పేర్లు. బానిసీఁడు, పడిగాపు అన సేవకుని పేర్లు

క. పగవాఁడు గొట్టు మార్తుఁడు
పగతు పవతు దాయ గొంగ బరిమాఱుతుఁడున్
పగదారి సూడు వెట్టం
బగు బహువచనమునను పగఱన శత్రువుఁడా. 325

పగవాఁడు, గొట్టు, మార్తుడు, పగతు, పవతు, దాయ, గొంగ, బరి, మాఱుతుఁడు, పగదారి, సూడు, వెట్టము, ని॥ బ॥ పగఱు అన శత్రువునిఁ పేర్లు

మ. అమరేంద్రాశ్రితపాద! కూర్మి చెలి నేయంబంటు పొంతంబు నే
స్తము చెల్మిం జెలికారముం జెలిమియున్ సంగాతముం బొందు నె
య్యమియున్ సంగడి నంటు ప్రేముడియు నెయ్యంబున్మరిన్ సంగడం
బమరెన్ క్షోణిని స్నేహనామములు నాంధ్రాభ్యాస వాక్యంబులన్. 326

కూర్మి, చెలి, నేయము, అంటు, పొంతము, నేస్తము, చెల్మి, చెలికారము, చెలిమి, సంగాతము, పొందు, నెయ్యమి, సంగడి, నంటు, ప్రేముడి, నెయ్యము, సంగడము అనఁగా స్నేహమునకుఁ పేర్లు

క. చెలిమరి నెయ్యరి నెయ్యుఁడు
చెలి సకుఁడును నంటుకాఁడు చెలిమీఁ డుద్దీ
డల రుద్దికాఁడు మిత్త్రయు
చెలికాఁడును పొందుకాఁడు స్నేహితునాఖ్యల్. 327

చెలిమరి, నెయ్యరి, నెయ్యుఁడు, చెలి, సకుఁడు, నంటుకాఁడు, చెలిమీఁడు, ఉద్దీడు, ఉద్దికాఁడు, మిత్త్ర, చెలికాఁడు. పొందుకాఁడు అనస్నేహితుని పేర్లు

గీ. ఆప్తతకును పల్లాయన మగును; మందె
మేలమగు ద్వేషమున కీసుమీఁజీ పేరు;
కంటు నొడ్డారమును సూడు కంటకంబు
పగయనంగ శత్త్రుత్వమౌ పంకజాక్ష. 328

పల్లాయనము అన ఆప్తత పేరు. మందెమేలము అనద్వేషమునకుఁ బేరు. కంటు, ఒడ్డారము, సూడు, కంటకము, పగ అన శత్త్రుత్వముఁ పేర్లు

గీ. జోస్యమన వేలుపనఁగను జ్యోతిషంబు;
జోసి జోస్యుఁడనంగను జ్యోతిషుండు;
తెరువరియు బాటసారియు తెర్వరియన
పథికునకుఁ బేళ్లు జెల్లును పద్మనాభ. 329

జోస్యము, వేలుపు అన జ్యోతిషము పేళ్ళు. జోసి, జోస్యుఁడు అన జ్యోతిషుని పేళ్ళు. తెరువరి, బాటసారి, తెర్వరి అనఁగా పథికుని పేళ్ళు.

గీ. వ్రాఁతసాకిరియనఁగను వ్రాఁతకాఁడ
నఁగను వాయసకాఁడనగును లేఖ
కునకుఁ బేళ్లను; వ్రాయసమనఁగ వ్రాఁత
యనఁగ లేఖనమునకౌను హరిముకుంద. 330

గీ. పొరిగొనఁగ నాశముఁజేయు వధియించు
పొరుగనఁగ సమీపమునకు పార్శ్వ
భువికి పేరుజెల్లు పొలపమన ప్రకాశ
మగును వాసనయగు వ్యాప్తమగును. 571

1 పొరిగొను=నాశనముచేయుట, వధించుట, 2 పొరుగు=సమీపము పార్శ్వము. 3 పొలపము=ప్రకాశము, వాసన, వ్యాప్తమగుట.

క. పొలమనగా సస్యోర్వర
పొలమనగా తృణసమృద్ధిభువియావిధమగా
పొలమన సూచన గ్రామము
పొలమన విపినము ప్రదేశమునకాఖ్య హరీ. 572

1 పొలము=పైరుగలభూమి, గరికిగలభూమి, విధము, సూచన, గ్రామము, విపినము, ప్రదేశము.

గీ. క్షితిని పొలయుననఁగ ప్రవేశించు సంచ
రించు వ్యాపించుటా సమీపించుటాను
పొలసనఁగ పొలయన మాంసమునకు మాంస
గంధమునకును మత్స్యశల్కమున కాఖ్య. 573

1 పొలయు= ప్రవేశించు, సంచరించు, వ్యాపించు, సమీపించు. 2 పొలసు, పొల=మాంసము, మాంసగంధము, చేఁపకునిచర్మము.

క. పొలయినా మృతి నాశము
పొలయుననన నశించుట మృతిబొందుట పేరా
పొలుచన ప్రత్యక్షము స్థిర
మలరెను పూజ్యమగు దృశ్యమగుటకు పేరై. 574

1 పొలయిక= మృతి, నాశనము, 2 పొలియు=నశించుట, మృతినొందుట, 3 పొలుచు=ప్రత్యక్షము, స్థిరము, కనిపించుట.

గీ. అవని పొలిపోవునా వ్యర్థమగుట భంగ
పడు నశించు మృతించు వేగ డరె పొసఁగు
నాలభించ ననుకూలించు నామ మమరి
పాప్యమగు పూజ్యమునకగు పంకజాక్ష. 575

1 పొలిపోవు,= వ్యర్థమగుట, భంగమగుట, నశించుట, మరణించుట. 2 పొసఁగు= లభించు, అనుకూలించు. చేరఁదగినది. పూజనీయమైనది.

గీ. పోఁడియన పూజ్య మంచితంబును మనోజ్ఞ
మాను పోఁడిమినాఁగ సౌఖ్యంబు విధము
పూజ్యమగు సంపదకు పేరు పోకడయన
గలిపరివర్తన నాశంబు గమనమగును॥ 576

1 పోడి=పూజ్యము, అంచితము, మనోజ్ఞము. 2 పోఁడిమి=సౌఖ్యము, విధము, పూజ్యము. సంపద, పోకడ, కలివర్తనము, నాశనము, గమనము.

గీ. పోకయన గమనము పేరుబుట్టె బహువ
చనమునను కపటపరివర్తనము మఱి పరి
వర్తనమగు పోటనఁగ నుల్బణము రణము
శౌర్య మాయుధ ముఖఘాత జలదమూర్తి॥ 577

1 పోక=గమనము, (బ. వ) కపటవర్తనము,ప్రవర్తనము.2 పోటు= ఉల్బణము, యుద్ధము శౌర్యము, ఆయుధపుదెబ్బ.

కం పోరామియనఁగ స్నేహము
పేరగు సంకటమునకును బేరాప్తతయా
పోరచియన వ్యర్థము ని
స్సారం బుపహారమాను సారసనాభా॥ 578

1 పోరామి= స్నేహము, సంకటము, ఆప్తత. 2 పోరచి= వ్యర్థము నిస్సారము, ఉపహారము,

కం పోరన కలహము యుద్ధము
పోరన కలహించు యుద్ధమును జేయుటకౌ

పోరితమన కలహంబగు
పోరితమన స్పర్థకాను బుధనుతచరణా. 579

పోరు= కలహము, యుద్ధము- కలహించుట- యుద్ధముచేయుట 2 పోరితము= కలహము, స్పర్థ.

గీ. పోరువయనంగ నుత్తరీయమునకు నాహ్వా
యంబగు కదళీపత్రిమూలావరణము
పోలనఁగ యుక్తమగుటకు పూజ్యమగుట
కాను శక్యమగుట సామ్యమగుట కాఖ్య. 580

1 పోరువ= ఉత్తరీయము, అరటియాకుల మొదటిబోదె. 2 పోలు= యుక్తమగు, పూజ్యమగు, శక్యమగు, సామ్యమగు.

సీ. పోసనమన లేప్యమును కాంతి క్షీరమకా
పోహణపౌఢత్వమును ఘటనయు
ప్రబ్బన వ్యాపించు వర్తిల్లు నతిశయ
మొందువర్థిలు నింద నిందసేయు
ప్రల్లదంబనఁగ దుర్భాషణంబగును పా
రుష్యంబు దుష్కృత్యరూపమాను
ప్రాతనా, బూర్వంబు బరగె పురాతన
మలరెను భృత్యునకాఖ్యయయ్యె

గీ. ప్రాబడనఁగ సిద్ధించు పురాతనమగు
బొనుపాఁమన నాచ్ఛాదమాను మూర,
ణమగు ఘర్షించుటకు మీలనంబు లేప
నమువసనమలినక్షాళనంబు శౌరి 581

1 పోసనము=లేప్యము, కాంతి, క్షీరము. 2 పోహణ= పౌఢత్వము ఘటనము, 3 ప్రబ్బు= వ్యాపించు, వర్తిల్లు, అతిశయమొందు, వర్ధిల్లు, నింద, నిందజేయు. 4 ప్రల్లదము= దుర్భాషణము, పారుష్యము, దుష్కృత్య

రూపము. 5 ప్రాంత= పూర్వము, పురాతనము, భృత్యుఁడు. 6 ప్రాబఁడు= సిద్ధించు, పురాతనమగు. 7 ప్రాము= ఆచ్ఛాదనము, మారణము, ఘర్షించుట మాయుట, పూయుట, వస్త్రపుమలినముకడుగుట,

గీ. ప్రిదులనఁగ చ్యుతమగుట పుష్పించు న్యూన
మపసరిల్లాఖ్య ప్రెగ్గడ యనఁగ మంత్రి
యౌను యువరాజు ప్రేముడించన ప్రియపడు
బాధపడు శోకమందుటౌ భవవినాశ. 582

1 ప్రిదులు= చ్యుతమగుట, పూలుపూయుట, న్యూనము, అపసరిల్లు. 2 ప్రెగ్గడ= మంత్రి. యువరాజు, ప్రేముడించు, ప్రియపడు, బాధపడు శోకమందుట.

కం భువి ప్రొద్దన కాలంబు ప్ర
సవదినమగు దినము పేరు సమయము పేరౌ
రవియగును నుషఃకాలం
బవు బంతియనంగ పఙ్క్తియగు కందుకమౌ 583

1 ప్రొద్దు= కాలము, ప్రసవదినము, సమయము, సూర్యుఁడు, ఉషఃకాలము. 2 బంతి= పఙ్క్తి, కందుకము.

గీ. బంటనఁగ శిష్యుఁడౌను సేవకుడు శూరు
డగును బగిసియు బైసియనఁగను గౌర
వంబు భాగ్యంబునకుజెల్లు బచ్చెన యన
బరగె లేప్యము శుక్లాది వర్ణము హరి. 584

1 బంటు= శిష్యుఁడు, సేవకుఁడు, శూరుఁడు. 2 బగిసి, బైసి=గౌరవము, భాగ్యము. 3 బచ్చెన= లేప్యము, తెలుపు మొదలగురంగులు.

సీ. బడియన క్రమమగు పాఠశాలయును వ
ర్ష్యాదర్థమగును నిశ్చయము పేరు
బడుగన కృశము శవం బశక్తుడు బన్న

మన నవమానమా నాపదయగు
బరియన రేఖయగు పార్శ్వమగు చోరుఁడగు
నంకుశంబగు శత్రునాహ్వయంబు
బరిగోలయన సృణి బాణమగును బలిత
మన బలిష్ఠము స్థూలమునకు పేరు

గీ. బలువనఁగ నధికంబగు బలము పేరు
జెల్లె బాగన విధమగు క్షేమమగును
సుందరంబగు బామన శోకమునకు
జన్మమునకాఖ్య జెల్లెను జలజనయన. 535

1 బడి= క్రమము, పాఠశాల, వెంబడి, నిర్ణయము. 2 బడుగు= కృశము, శవము, అశక్తుఁడు 3 బన్నము= అవమానము, ఆపద. 4 బరి= రేఖ, పార్శ్వము, చోరుఁడు- అంకుశము, శత్రువు. 5 బరిగోల= సృణి (అంకుశము) బాణము. 6 బలితము= బలిష్ఠమైనది, లావైనది. 7 బలువు= అధికము, బలము, 8 బాగు= విధము, క్షేమము, సుందరము, 9 బామ= శోకము, జన్మము.

గీ. బారియన హింసయగును నిర్బంధము కరి
నిగళమగును బారాదియనగ ననేక
మునకు నధికంబునకుపేరు దనరె బాస
వాలనఁగ ఋషి దేవత వఱలె శౌరి 586

1 బారి= హింస, నిర్బంధము, ఏనుగుసంకెళ్ళు. 2బారాది=అనేకము అధికము. 3బాసవాలు= ఋషి, దేవత.

గీ. బాసయనఁగ ప్రతిజ్ఞయగు భాషయగు ప్ర
మాణమగును సంకేతమగు మఱి వ్రతమగు
బింకమన గర్వమగు దృఢం బింక నున్న
తంబగుటకాఖ్య జెల్లెను దానవారి 587

బాస= ప్రతిజ్ఞ, భాష, ప్రమాణము, సంకేతము, వ్రతము. 2 బిం
కము= గర్వము, దృఢము, ఉన్నతము.

క. నిగమాంత వేద్య బిడ్డయ
నగ బాలుండగు సుపుత్రినామము పుత్రుం
డగు బిత్తరమన చంచల
మగును ప్రకాశము విలాసమగు సరసంబౌ 588

1 బిడ్డ= బాలుఁడు, పుత్రిక, పుత్రుఁడు. 2 బిత్తరము= చంచలము,
ప్రకాశము, విలాసము. సరసము.

గీ. బిమ్మిటియన సంకోచమ్ము వివశమాను
బిరుదనఁగ శౌర్య చిహ్నంబు పేరు శూరు
డగు సహర్షంబగును బుజయనఁగ భుజము
కుండలీకరణంబగు కోమలాంగ. 589

బిమ్మిటి=సంకోచము, వివశము. 2బిరుదు= శౌర్యచిహ్నము, పేరు,
శూరుఁడగుట, సమర్థము. 3 బుజ= భుజము, కుండలీకరణము.

గీ. బిల్లయనగను రవిశశిబింబము లుప
ధానమగు మణివర్తులత్వఁబు పేరు
బరగె లోహాదివర్తుల పత్రికాఖ్య
జెల్లె ఖండమునకు పేరు శేషశయన 590

1 బిల్ల= రవిశశిబింబములు,ఉపధానము,(దిండు)గుండ్రమైనది, లోహ
పుపతకము, ఖండము.

గీ. ఆంధ్రమున బుడిబుడియన నల్పమాను
సంభ్రమించుటకౌ బురసాయనంగ
హేమతంతువు కౌశేయనామ మమరె
యరుణకౌశేయమున కాఖ్యయగు ముకుంద 591

1 బుడిబుడి=అల్పము, సంభ్రమించుట. 2 బురసా= బంగారుతీఁగ, పట్టువస్త్రము.

గీ. బూటకంబన బూకనాఁ బొసగె మాయ
వంచనకుపేరు బూమెనా వంచనాఖ్య
యగు కపటవేషమును మాయయౌను బెంగ
యనఁగ నార్తధ్వనికి విరహాగ్ని కౌను. 592

1 బూటకము, బూక= మాయ, వంచకుఁడు. 2బూమె= వంచకుఁడు కపటవేషము, మాయ. 3 బెంగ= ఆర్తధ్వని, విరహాగ్ని.

గీ. వసుధ బెగ్గిల్లనఁగ పరవశమగు భయ
పడును చింతించు చలియించు బరగె బెట్టి
దమన కఠినంబు క్రౌర్య ముద్ధతము బహువ
చనమునను నిష్ఠురోక్తులౌ జలదగాత్ర 593

బెగ్గిల్లు= పరవశమగు, భయపడు, చలించు. 2 బెట్టిదము= కఠినము క్రౌర్యము, ఉద్ధతము, (బహువచనమున) నిష్ఠురోక్తులు,

కం జగతిని బెట్టన గౌరవ
మగు దృఢమునకాఖ్య యతిశయము నుద్ధతిపే
రగు బెడఁకన బెణఁకనగా
నగు చలనము నపసరిల్లుటాఖ్య మురారీ. 594

1 బెట్టు= గౌరవము, దృఢము, అతిశయము, ఉద్ధతి, బెడఁకు, 2బెణకు= చలనము, అపసరిల్లుట.

గీ. బెడఁగన మనోజ్ఞ మధికంబు పేరు సుంద
రము విలాసంబగును బెడిదమన బేడి
దంబనఁగ కఠినం బధికంబు పరుష
వచనము భయంకరంబగు వాసుదేవ 595

బెడఁగు=మనోహరము, అధికము, సుందరము, విలాసము. 2 బెడిదము, బేడిదము= కఠినము, అధికము, పరుషవచనము, భయంకరము.

గీ. బెడియుసన బెసుకనఁగను వికలమగుట
కగును దోషంబగు బెరయు ననలభించు
మఱియు ప్రాపించు వ్యాపించు వఱలెజెఱుకు
నాఁగభేదంబగు ప్రయోజనంబగు హరి 596

1 బెడియు, బెసుకు= వికలమగుట, దోషము. 2 బెరయు= లభించు ప్రాపించుట, వ్యాపించుట. 3 బెరుకు=భేదము, ప్రయోజనము.

కం బేరజమన కుత్సితునకు
పేరు కపటవర్తనంబుపేరు పరుషవా
క్కారాబైసియనంగను
గౌరవమగు భాగ్యమగును ఘనరుచిదేహా. 597

1 బేరజము= కుత్సితుడు, కపటవర్తనము, పరుషవాక్కు, 2 బైసి= గౌరవము, భాగ్యము.

గీ. బొట్టనంగ ననుస్వారమును జలాది
బిందువగును మంగళసూత్ర భృతసువర్ణ
పత్రమగు తిలకముపేరు బరగెబొమయు
నంగ ప్రతిమయు భూ్రివగు నలిననాభ 598

1 బొట్టు= అనుస్వారము, జలబిందువు, మంగళసూత్రము, తిలకము 2 బొమ= కన్నుబొమ, ప్రతిమ.

కం మురహర బొమ్మయనంగను
బిరుదాంకంబగును ప్రతిమపేరగు భూ్రివా
సగసిజగర్భుం డల్పం
బరయగ నవమానచిహ్నమగు నాంధ్రమునన్ 599

1 బొమ్మ= బిరుదాంకము, ప్రతిమ, కనుబొమ్మలు, భ్రష్ట అల్పము, అవమానచిహ్నము.

గీ. బొరియనా గంధ్రమును గర్తమును బలంబు
బరగె బోటన ధూర్తుడౌ ప్రౌఢునకు న
భిఖ్య కుధరోపరిస్థలి పేరు బోన
మనఁగ భోజనమగు నన్నమౌను శౌరి 600

1 బొరియ= రంధ్రము, కలుగు, బలము. 2 బోటు= ధూర్తుఁడు, ప్రౌఢుఁడు, కొండపైనిగలతావు. 2 బోనము= భోజనము, అన్నము.

మ. వసుధన్ బోతుయనం గిరాతకుఁడుకై వర్తుండగున్ బ్రాఁతినాఁ
బొసగెన్ బ్రేమము దుర్లభంబధికమై బ్రుంగన్న గూఢస్థలం
బెస మగ్నంబగు మందునాగను జ్వలించీర్ష్యాదితాపంబు పే
రెసగెన్ మంతనఁగా బ్రసిద్ధియగు మంత్రీశుండు మంత్రంబగున్

1 బోయ= కిరాతుఁడు, చేఁపలబట్టువాఁడు. 2 బ్రాఁతి= ప్రేమ, దుర్లభము ,అధికము. 3 బ్రుంగు= గూఢస్థలము, మగ్నమగుట, మరణించుట, మఁడుట, ఈర్ష్యాదులవలనితాపము. 4 మంతు= మంత్రి, మంత్రము.

గీ. మంతనంబన గోప్యమేకాంతమగును
మఱియు నాలోచనంబగు మందయనగ
గోష్ఠమగు పశుబృందమౌ ఘోషమౌను
మందటయన సన్నిధికి సమ్రితకుపేరు 602

1 మంతనము= రహస్యము, ఏకాంతము, ఆలోచనము. 2, మంద= కొట్టము, పశుసమూహము, గొల్లపల్లె. 3 మందట= చేరువ, అడకువ.

గీ. మందలయనంగ సన్నిధి మాడ్కి యనుగ
డగునుమందెమేలమన స్నేహ మనురాగ
మగు నుపేక్షయు మక్కళించనఁగను సవ
రించు సద్రుశ మావర్తించు కాంచె పేరు 603

1 మంచల= సన్నిధి, మాడ్కి, బ్రదుకుదెరువు- 2 మందెమేలము= స్నేహము, అనురాగము, ఉపేక్ష. 3 మక్కళించుట= సవరించుట, సద్భశము, ఆవర్తించుట.

కం. జగతిని మక్కన మలినం
బగు కాంతి విహీనమగుట కాఖ్యయగు మృతిం
చగు రోగపీడితంబగు
మగటిమిపుంసత్వమగును మఱి పౌరుషమా 604

1 మక్క= మలినము, కాంతివిహీనమగుట, మరణించుట, రోగము చేబాధింపబడుట. 2మగటిమి= మగతనము, పౌరుషము.

కం. మగఁడన పతి పురుషుఁడు రా
జగును మహాశూరునాఖ్యయగు మచ్చికనా
మగు మోహంబాసక్తియు
మగపాడియనంగ శౌర్యమగు నుపరతియా 605

1 మగఁడు= పతి, పురుషుఁడు, రాజు, మహాశూరుఁడు, 2మచ్చిక= మోహము, ఆసక్తి, 3 మగపాడి=శౌర్యము, ఉపరతి.

గీ. ఉర్వి మచ్చున పారవశ్యావధియగు
సౌధమగు మట్టమనంగ హ్రస్వంబు న్యూన
మగును పరిమితియగును మట్టాడనంగ
సంచరించుటకౌను వ్యాపించుటౌను 606

1 మచ్చు = పారవశ్యావధి, సౌధము, 2 మట్టు= హ్రస్వము. తక్కువ, పరిమితి. 3 మట్టాడు= సంచరించుట, వ్యాపించుట.

కం. ధరమడుఁగన నుపశాంతియుఁ
బరిశుద్ధాంబరము హ్రదము పద్మాకరమా
పరిశుద్ధము తాంబూలం
బరయఁగ నమ్రిమగుపేరు హాటకచేలా 607

1 మడుంగు= ఉపశాంతి, పరిశుద్ధాంబరము, హ్రదము, సరస్సు, పరిశుద్ధము, తాంబూలము, నమ్రత్వము.

గీ. అవని మడఁకయనంగ పర్ణాది యోజ
యౌను బద్ధబుమభహాలమౌను మడఁగ
నంగ నమ్రవమావృతనామము మడ
పన విముఖమగు నిష్ఫలమౌను శౌరి. 608

1 మడఁక, = ఆకులుమున్నగునవిమడచుట. ఎద్దులుగట్టిననాగలి 2 మడఁగు= అడఁగియుండుట, మరలుట. 3 మడవు= విముఖమగుట, నిష్ఫలము.

గీ. మడియనంగ కేదారనామంబు శుద్ధ
వస్త్రమునకాఖ్య మదినాఁగవలెనె బుద్ధి
మనము వెలుగొందె మనుగడ యనఁగజీవ
నంబు జీవనోపాయమౌ నలిననాభ. 609

1 మడి= వరిమడి 2 శుద్ధవస్త్రము. మది= బుద్ధి మనస్సు, 3 మనుగడ= జీవనము, జీవనోపాయము.

కం మనునా వర్తిలు మృత్తిక
యను జీవంచగును బుష్య ముర్వికి పేరౌ
మనికియన వసించుట జీ
వనమగు జీవించుటౌను వాసస్థలమౌ. 610

మను= మట్టి, జీవము, ఋష్యమనుజంతువు, భూమి. 2మనికి=జీవనము జీవించుట, నివాసస్థలము.

కం మనువన భర్తయగుఁ జీ
వనమగు మరణించు పతినివరియించగు వ
ర్తనమగు మన్నన మృత్తు న
వనికిని బుశ్యమృగమాఖ్యవలెనె మురారీ. 611

1 మనువు=భర్త, జీవనము, మరణించుట, భర్తనువరించుట, వర్తనము- 2 మన్ను=మృత్తిక, భూమి, ఋశ్యమృగము.

గీ. మబ్బనంగను మేఘనామంబు తిమిర
మునకభిఖ్యయు నజ్ఞానమునకు పేరు
మరులునాఁగ పిశాచనామంబు మోహ
మునకు పేరగు భవనామవనధితరణి. 612

1 మబ్బు=మేఘము, చీకటి, అజ్ఞానము. 2 మరులు=పిశాచము, మోహము.

గీ. మఱపనఁగ విస్మృతియగు ప్రమాదమగును
పారవశ్యంబు నజ్ఞాన భావమగును
మఱుఁగనఁగ గూఢమునకు నామము తిరోహి
తంబు సంతాపమొందుటొ నంబుజాక్ష 613

1 మఱపు=మఱచిపోవుట, పొరపాటు, పారవశ్యము, అజ్ఞానభావము. 2 మఱుఁగు=గూఢము, చాటునకుఁబోవుట, సంతాపమొందుట.

కం అంచితముగ మలయుననన్
సంచారం బుద్యమించు సంకీర్ణము వ్యా
పించు తపించగు నుద్రే
కించగు నాంధ్రమున కలుమగిరి వజ్రపదా 614

1 మలయు=సంచారము, ఉద్యమించుట, సంకీర్ణము, వ్యాపించుట, తపించుట, ఉద్రేకించుట.

కం మసకపయిన స్వల్పాసిత
మెసగె ప్రదోషాంధకారగ మిటుల మసకయా
మసకంబన సంభోగము
వెస సంభోగేచ్ఛపేరు వెలసె మురారీ 615

1 మసక=కొంచెము తెలుపురంగు, సాయంకాలానంతరప్రత్యేకటి, సంభోగము, సంభోగేచ్ఛ.

కం. ఖగపతి వాహన మసలు న
నగ విహరించుట జలతపనం బాలస్యం
బగు నావర్తించుట పే
రగు మస్తనగా సమృద్ధి యగును మదంబౌ. 616

1 మసలు=విహరించు, నీటీనికాచుట, ఆలస్యము, వర్తించుట, 2 మస్తు=సమృద్ధి, మదము.

గీ. ధరణిమాటనగా తిరోధానమునకు
నుపశయమునకు నావృత్తి కొప్పె మాను
నా నివారించు మోచన మౌను వృక్ష
మగు మనోజ్ఞమునకు నామ మలరెశౌరి. 617

1 చాటు=చాటుగనుండుట, ఉపశయనము, వలుమాటు, 2 మాను=నివారించుట, మోచనమగుట, వృక్షము, మనోహరము.

గీ. మాపనంగ ప్రదోషంబు మలినకృత్య
మగును రాత్రికిజెల్లు మాఱిన నశించు
ప్రతిముఖుండగు నావృత్తి ప్రతియు నన్య
మగును ప్రతిరూపమగుటకౌ నంబుజాక్ష. 618

1 మాపు=ప్రదోషము, మాసిపోవుట, రాత్రి. 2 మాఱు=నశించుట, ఎదురుదిరుగుట, పర్యాయము, మఱియొకటి, ఇతరము, ప్రతిరూపమగుట.

గీ. మాలిమియన నౌకాశాస్త్రమర్మమౌను
మఱియు వాత్సల్యమునకగు మాలె నాగ
మాంలికకు సౌధమునకాఖ్య మాసటియన
మల్లునకు శూరునకుపేరు జెల్లెశౌరి. 619

1మాలిమి=నౌకాశా స్త్రసర్మము, వాత్సల్యము. 2 మాలె=దండలు, సౌధము, 3 మాసటి=మల్లుఁడు, శూరుఁడు,

గీ. మావనఁగ నశ్వభులసంగ మము తురగము
మీనకుల మూర్ఛితౌషధంజాను మించ
నఁగ పకాశము చంచలయగును మిండ
డనఁగ విటుడగు పురుషుండు నధికుడాను. 620

1 మావు=గుఱ్ఱములసంగము, గఱ్ఱము, చేపలనుబట్టు సాధనము, 2 మించు=ప్రకాశము, మెఱుపు. 3మిండఁడు=విటుడు,పురుషుఁడుఅధికుఁడు.

గీ. అవని మిక్కిలినా శ్రేష్ఠ మధికమాను
మిగులనఁగ శేషము నతిక్రమించు నతిశ
యించు శేషించుపేరగు నీక మిటార
మనఁగ నతిశయ మున్నతం బగును శౌరి. 621

1, మిక్కిలి=శ్రేష్ఠము, అధికము. 2 మిగులు=శేషము, అతిక్రమించుట, అతిశయించుట, శేషించుట. 3 మిటారము, అతిశయము, ఉన్నతము

చ. అవని మిటారియున్న ప్రమదాఖ్యయు నున్నతమైనదాని పే
రవు మిడినాఁగ తీక్ష్ణమునకౌ మఱి గర్వము నున్నతంబు పే
రవు నీక మిట్ట తీక్ష్ణమునకాఖ్యయు నున్నతభూమి యున్నతం
బవు మిడిపోవునాఁదొలఁగుటౌ మఱినూ్యనమగుః జనార్దనా.

1 మిటారి=స్త్రీ, ఉన్నతమైనది. 2 మిడి=తీక్ష్ణము, గర్వము, ఉన్నతము, 3 మిట్ట=తీక్ష్ణము, ఉన్నతభూమి, ఉన్నతము. 4 మిడివోవు=తొలఁగుట, తక్కువగుట,

గీ. ధర మిడియనఁగ బహిఃపరిధావనమగు
నుద్గమంబగును మిడుఁగు జొప్పె నగ్ని
కణముఖద్యోతమున మిత్తియనఁగ మృత్యు
దేవతకు మృతిపేరగు దీనరక్ష. 623

1 మిడియు=వెలికుఱకట, ఎగురుట, 2 మిడుఁగురు=అగ్నికణము, మిణుఁగురుపురుగు. 3 మిత్తి=మృత్యుదేవత, మృతి.

కం ఆంచితెముగ మిడుకన గ
ర్వించుస్వభావంబు పరితపించుటకొ జీ
వించగును సంచరించు చ
లించగు నిష్క్రమమగు నలిననేత్రియుగా. 624

1 మిడుకు=గర్వించుస్వభావము, పరితపించుట, జీవించుట, సంచరించుట, చలించుట, ఎండిపోవుట.

కం ఇల మినుకన కిరణము మం
గళ సూత్రాభరణనామ కము బహువచనం
బొలసిన వేదము వాక్యం
బలరెను మిన్నయన రత్నమగు శ్రేష్ఠంబౌ. 625

1 మినుకు=కిరణము, మంగళసూత్రము, (బహువచనమున) వేదము, వాక్యము. 2 మిన్న=రత్నము, శ్రేష్ఠము,

కం వనజాక్షి మిసిమియన నూ
తనరుచి నవనీతమునకు దనరెను మీఁద
న్ననగు భవిష్యత్కాలం
బును పరమును నుపరిభాగ మునకాఖ్యహరీ.

1 మిసిమి=నూతనరుచి, నవనీతము, 2 మీఁదు=భవిష్యత్కాలము, పరము, ఉపరిభాగము.

కం కమలాక్షా! మీటన నధి
కము వృద్ధియు నాయుధాగ్రఘాతము నుద్రే
కము నఖరాగ్రాదివిఘ
ట్టము పేరగు భక్తహృదయ సారసమిత్రా. 626

1 మీటు=అధికము, వృద్ధి, ఆయుధాగ్రపుపోటు, ఉద్రేకము, గోటికొన మొదలగువానితోఁ పాడుచుట,

క. దనుజాంతక! ముంగిలియన
గను మధ్యస్థానము గృహకత్యమగును ము
క్కన నాసికంబు చూచుక
మును చుంచువు నామమౌను మునినుతచరణా. 627

1 ముంగిలి=మధ్యస్థానము, గృహకత్య 2ముక్కు=నాసికము, చన్నుమొన, పక్షిలోనగువానిముక్కు,

క. క్షమితా! ముచ్చటయన పే్రి
మము వృత్తాంతంబు నిచ్ఛ మఱియును సల్లా
పము ముట్టడియన నిర్బం
ధము సైన్యావరణమగును దైత్యవిదారీ. 628

1 ముచ్చట=పే్రిమము, వృత్తాంతము, కోరిక, ప్రిసంగము, 2 ముట్టడి=నిర్బంధము, సైన్యావరణము.

సీ. ముడివడుతన లంభిచడరె సంధిం చతి
శయ మొందునా కీర్ణమయము పేరు
ముడుఁగనగా చేష్టలుడుగు సంకోచించు
ముకుళించు న్యూనమాటలును పేరు
ము త్తసరియసంగ ముక్తావళికిపేరు
ధాన్యవిశేషాభిధానమౌను
ముదలనాఁ గేదారభూమి లక్ష్యం బాజ్ఞ
ముదియన వార్ధకము మఱివృద్ధు

గీ. ముదుకనా వృద్ధునకు స్థూలమునకు పేరు
ముదురనఁగ వృద్ధి వృద్ధాప్యమును ఫలాది

పరిణమించగు ముద్దన బరగె చుంబ
నము మనోజ్ఞత యాదరణంబు శౌరి. 629

1 మడివడు=లభించు, జతపఱచు, అతిశయమొందు, వెనుగబడుట. 2 ముడుగు=చేష్టలుడుగుట, సంకోచించుట, ముకుళించుట, న్యూనపడుట. 3 ముత్తెసరి=ముత్తెములహారము, ధాన్యవిశేషము. 4 ముదల=మాగాణిపాలము, లక్ష్యము, ఆజ్ఞ. 4 ముది=వార్ధకము, ముదుసలివాఁడు. 5 ముదుక=వృద్ధుఁడు, స్థూలమైనది. 6 ముదురు=వృద్ధి, వృద్ధావస్థ, ఫలాదులుముదురుట 7 ముద్దు=చుంబనము, మనోహరము, ఆదరణము.

క. మునునా నగ్రపదవిధం
బున నాద్యంతాదులౌను ముప్పిరిగొనునాఁ
గనగు త్రితంతాక్షీర్ణ౦
బును సంకీర్ణంబునగు విబుధనుతనామా. 630

1 మును=మొట్టమొదట, ముందు, వెనుక. 2 ముప్పిరిగొను=మూఁడుపేటలతోఁద్రాడుబేనుట, కలసిపోవుట,

గీ. మునుకనంగను సంతాపమునకు ప్రతివ
చించు వచియించుటకుపేరు చెలగె మురియు
ననఁగ గమనాదిలావణ్యమౌను ఖండ
మగుట గర్వించు నావృత్తిమురుగుట కాఖ్య. 631

1 మునుకు=సంతాపము, ప్రతివచనమునొసంగుట, 2 మురియు=నడకలోనియందము, ఖండమగుట, గర్వించుట, తెగుట-

గీ. మురువనఁగ సుందరము గర్వమునకు పేరు
వఱలె మురియునఁ గమన లావణ్యమగును
గర్వమగు మురుసూపనఁగా నతిక్ర
మించ చతిశయించునామహా మేదినీశ. 632

1 మురువు=సుందరము, గర్వము 2 మురి=నడకయందము, గర్వము- 2 మురుసూపు=అతిక్రమించుట, అతిశయించుట-

చ. క్షమనిక మూఁకనా గణము సైన్యము మూఁడనలభ్యమౌ సమా
ప్తమునగు మూదలించు నియతంబవధానము మూల నాఁగ కో
ణమునకు పేరగుఁ గబరినామముజెల్లును మెండునా నధి
క్యము నధికంబుపే రతిశయంబగు నున్నతమౌ జనార్దనా.

1 మూఁక=గణము, సైన్యము. 2 మూఁడు=లభ్యమగుట, సమాప్తమగుట. 3 మూదలించు=నియతము, హెచ్చరిక. 4 మూల=కోణము, కబరి 5 మెండు=విస్తారము, అధికము, అతిశయము, ఉన్నతము.

గీ. అంబుజేక్షణ మీరితోఁవనఁగ నతిశ
యించు సఫలమగుట విజృంభించుటకు న
శించు వర్ధిలునామంబు లెంచ మెట్ట
యనఁగ నున్నతభూమియౌనం ప్రియాను. 634

1 మీరిపోవు=అతిశయించు, సఫలమగు,విజృంభించు, నశించు, వర్ధించు. 2 మెట్ట =ఉన్నతభూమి, పాదము.

క. కమలాక్షా మెచ్చన శ్లా
ఘ్యమగును లక్ష్యించుపేరు కలిగెను బహుమా
నము శ్లాఘించుటకౌ ప్రే
మమునకు శ్లాఘనకుజెల్లు మన్మథజనకా. 635

1 మెచ్చు= శ్లాఘనము, లక్ష్యముంచుట, బహుమానము, శ్లాఘించుట, ప్రేమము, శ్లాఘింపదగినవస్తువు.

క. భువిమెట్టన సుంకవుఁదల
మవు కుధరము రాశి ఘట్టమౌ సోపానం
బవు బహువచనంబున పే
రవు వీణాతంతులాఖ్యయగు పాదుకలుఁ. 636

1 మెట్టు=సుంకములుకట్టుతావు, కొండ, రాశి, ప్రదేశము, సోపానములు, (బహువచనమున) వీణాతంతులగద్దెలు.

గీ. అవని మెత్తయనంగ పల్యాయనంబు
మృదువుగలదియు తల్పమగా మెత్తబాటు
నా౯ మృదుత్వము నాలస్యనామమగుచు
దనరె మెత్తనయన మృదుత్వ౦బు శాంతి. 637

1 మెత్త=గుఱ్ఱపుపల్లము, మృదువైనది, పఱపు. 2 మెత్తబాటు=మృదుత్వము, ఆలస్యము 3 మెత్తన=మృదుత్వము, శాంతి.

గీ. మెప్పన౯గ ప్రీతి శ్లాఘనమెుప్పె వరము
పేరు మెయినా౯గ దేహంబు విధము పార్శ్వ
మునకు ననుగతికా మెయికొనునన ల
భించు ననుకూలమగు సమ్మతించుపేరు
మఱియు నంగీకరించుటా మదనజనక. 638

1 మెప్పు=ప్రీతి, శ్లాఘనము, వరము. 2 మెయి=దేహము, విధము పార్శ్వము, వెంబడించుట, 2 మెయికొను= లభించుట, అనుకూలమగుట. సమ్మతించుట, అంగీకరించుట.

క. మెరమెరయనగ మనోవ్యథ
బరగెను సంశయము భేదభావంబగుచు౯
ధర మెఱపన౯గా విద్యు
త్తరయ ప్రకాశింపునామ మాశ్రితవరదా. 639

1 మెరమెర=మనోవ్యథ, సందేహము, భేదభావము. 2 మెఱపు=విద్యుత్తు, ప్రకాశించుట.

కం. క్షమితా మెఱవడినా ధై
ర్యము ప్రౌఢత్వంబు నతిశయంబగు నుద్రే

కము పేరగు విద్యోత్సవ
మమ రెనా గౌరవము పేరు హాటక చేలా. 640

మెఱనడి=స్థైర్యము, ప్రౌఢత్వము, అతిశయము, ఉద్రేకము, ఊకే గింపు, గౌరవము,

గీ. మెలకువయనంగ నవబోధమలరె జీవ
నంబు సంచారమును ప్రబోధాఖ్యయు మెలఁ
గనఁగ నవబోధవర్తనంబౌను సంచ
రించునామంబు జెల్లె వర్తించుటౌను. 641

1 మెలకువ=జాగరూకత, జీవనము, సంచారము, మేల్కొనుట. 2 మెలఁగు=జాగరూకతతో వర్తించుట, సంచరించుట, వర్తించుట.

కం. మెలపన వర్తనకృతి కో
మల మవబోధాఖ్యయగు భ్రమణమగు నచలం
బలరెను మెప్పిన నట్లగు
మెలయు ప్రవర్తించు సంగమించుట కలరెన్. 642

1 మెలపు=మెలఁగునట్లుచేయుట, కోమలము, జాగ్రత్త, తిరుగుట, చలింపక నిలుకడగానుండుట. 2 మెలయు=ప్రవర్తించుట, సంగమించుట.

చ. ఫణిశయ మేయనన్ విధము పార్శ్వము దేహము పేరు మేకొన
న్నను లభితంబు సమ్మతిలునామమునౌ నవబోధ ముద్యమిం
చునగును ప్రాప్యమాటకగు జృమ్మిక మేడనమన్న మేళనం
బునుమృగవిష్కిరాదిరణము గమణిసంగమమౌ తెనుంగునన్

1 మే=విధము, పార్శ్వము, దేహము పేరు. 2 మేకొను=లభించుట సమ్మతించుట, జాగ్రత్తగైకొనుట, ఉద్యమించుట, పొందుట. 3 మేడ నము=కలియుట, పక్షులు మృగంబులు మున్నగు వాని తగవు, సంభోగము.

మ. జగతిన్మేననగా శరీరమగు పార్శ్వంబౌను జన్మంబు పే
రగుగా మేరయనంగ్రమంబవధి మర్యాదాఖ్యసీమాహ్వయం

బగుచుఁ మేరువనంగ హారతరళంబౌ తీరసేత్వాఖ్యకీ
ర్తిగనేఁ మేలిమినాఁగస్వర్ణమగునాధిక్యంబగుఁ మాధవా.

1 మేను=శరీరము, పార్శ్వము, జన్మము, 2 మేర=క్రమము, అవధి, మర్యాద, హద్దు. 3 మేరువు=హారమునందలి పతకము, తీరము, సేతువు. 4 మేలిమి=బంగారము, విస్తారము.

కం. కమలాక్షా మేలనలా
భము నుపకారము మదము శుభము నధికము శ్రే
ష్ఠము మోహము సుకృతము పు
ణ్యము నుపరివిశేషము శుభమైనది పేరా. 645

1. మేలు=లాభము, ఉపకారము, మదము, శుభము, విస్తారము, శ్రేష్ఠము, మోహము, సుకృతము, పుణ్యము, మీఁదిభాగము, విశేషము, శుభమైనది.

గీ. జగతి మేలుకట్టు సోపాన ముల్లాభ
మగును మేవడియన నగు నుపాయ
మునకుపేరు నుచిత మునకాఖ్య నమ్రిత
నామ మసురరాజ నగపవజ్ర. 646

1. మేలుకట్టు=సోపానములు, చాందిని. 2 మేవడి, ఉపాయము తగినది, నమ్రత్వము.

గీ. మేళగించనంగ మేళనమగు సంఘ
టించు సంగమించు కాంచె పేరు
మై శరీరమౌను మరి పార్శ్వమౌ నావృ
తంబునామమగు విధంబగు హరి. 647

1 మేళగించు=కలిసికొనుట, సమకూర్చుట, సంభోగించుట, 2 మై=శరీరము, పార్శ్వము, ఆవృతము' విధము.

కం. క్షితి మైవడియనగా సా
మ్యతయగు ననుకూలనామమగు విధమగు స

సమ్మతియగు మొగమనఁగా ము
ఖ్యత శ్రేష్ఠము ముఖముపేరుగాంచె ముకుందా. 648

1 మైపడి= సౌమ్యత్వము, అనుకూలము, విధము, సమ్మతి. 2 మొగము=ముఖ్యత, శ్రేష్ఠము, ముఖము.

చ. మురహర మొగ్గలంబుమరి మొక్కలమన్న ధైర్యమౌను ము
ష్కరవచనంబు నుత్సుకము శౌర్యము పేరగు ముష్కరత్వ మా
ధరణి ప్రతాప మప్రతిహతంబగు ముష్కరమౌను మొత్తనా
బరగెను ఖండితంబునకు బాగుగనో ప్రహరించు పేరుతో॥

1 మొగ్గలము, (రూ) మొక్కలము= ధైర్యము, మూర్ఖవాక్యము, ఉత్సాహము, శౌర్యము, మూర్ఖత్వము, ప్రతాపము, తిరుగులేనిది, మూర్ఖము. 2. మొత్తు=ఖండితము, కొట్టుట.

కం. మొగియన నుద్యమనామం
బగు బహుళైకత్వనామ మగును విధంబౌ
మొగియుననంగ ప్రధావిం
చగు నుద్యమ మొందుటాఖ్య హాటకచేలా. 650

1 మొగి= ఉద్యమము, మొత్తము. విధము. 2 మొగియు=కవియుట ప్రయత్నించుట.

కం. మొనయన వ్యూహం బగ్రిం
బును సైన్యంబునకు పేరు మొనకాఁడన ము
ఖ్యునిపేరగు సేనానా
థునిపేరగు శూరుడౌను దోషవిదారీ. 651

1 మొన= వ్యూహము, అగ్రము, సైన్యము. 2 మొనకాఁడు= ముఖ్యుఁడు, సేనానాయకుఁడు, శూరుఁడు.

కం. మొనపనగా నగు నుద్యమ
మును లభియింపంగసేయు మోప్పెయనఁగ మూ

ర్ఖునికి పరుషమగును మొనయు
ననగ లభిం చుద్యమించు టాదనుజారీ. 652

1 మొనపు= ఉద్యమము, లభింపఁజేయుట. 2 మొప్పె= మూర్ఖుఁడు, పరుషము. 3 మొనయు= లభించుట, ఉద్యమించుట.

కం. మొఱగనఁగా వంచకునకు
వఱలె తిరోధానమునకు వంచించుటకౌ
మఱి వంచకనామంబగు
మొఱకన మూర్ఖునకు పరుషమునకాఖ్య హారీ. 653

1 మొఱఁగు=వంచనము, మాటుపడుట, వంచించుట, వంచకుఁడు. 2 మొఱకు= మూర్ఖుఁడు కఠినము.

గీ. మొల్లమన కడునధికంబు జెల్లెను ధన
మగును మోపన మౌర్వి తృణాధిభార
మునగు నారోపణంబగు మోమనంగ
ముఖము ద్వారంబు శ్లేష్మమౌ మునినుతాంఘ్రి. 654

1 మొల్లము= మిగులవిస్తారము, ధనము. 2 మోపు= వింటినారి, గడ్డిమోపు, ఆరోపించుట. 3 మోము= ముఖము, ద్వారము, శ్లేష్మము.

సీ. మోరనంగను తకట్రిమును గిరిశిఖరంబు
మోవివృతవిశ్లేషము నధరంబు
మోసయనంగను మోసమనంగ వం
చనప్రమాదంబగుచౌర్యమగును
మ్రందన వివశమూర్ఛయు పీడితము హ్రాతి
బొందుటకగు బాధనొందుటౌను
మ్రగ్గన మరణించు మరినష్టమగుటకౌ
విహ్వాలించుటకగు వివశమగును

గీ. రంతనఁగ క్రీడకలరును రతికిపేరు
వఱలె రంగనశ్వేతాది వర్ణమునకు
కాంతికిని పేరుజెల్లె రకంబనఁగ
శ్రేష్ఠమును సుందరంబగు శేషశయన. 655

1 మోరు= మజ్జిగ, కొండకోన. 2 మోవి= వృక్షవిశేషము, పెదవి
3 మోస= మోసము, వంచనము, ప్రమాదము, దొంగతనము. 4 క్రుంద=
ఒడలెఱుంగనిమూర్ఛ, పీడింపబడినది, హీనపడుట, బాధనొందుట.
5 మ్రగ్గు= మరణించుట, నష్టమగుట, కప్పలించుట, వివశమగుట,
6 రంతు= క్రీడ, సంభోగము. 7 రంగు= తెలుపుమొదలగురంగు, కాంతి.
8 రకము= శ్రేష్ఠము, సుందరము.

గీ. రచ్చనా మండపము సభ రాజవీధి
కలకలంబును గోష్ఠియు కలహమగుచు
దనరె రక్కొనునాఁగ రెక్కొనుననఁగల
భించువర్ధిలుస్వస్థత గాంచుపేరు. 656

1 రచ్చ=మండపము, సభ, రాజవీధి, కలకలము, గోష్ఠి, కలహము.
2 రక్కొను (రు. రెక్కొను)= లభించుట, వర్ధిల్లుట। స్వస్థతనొందుట.

గీ. రట్టనగ నిందకానుపద్రవముపేరు
రమణనా రాణయనఁగను రవణయనఁగ
నంచితము ప్రీతి విధముపేరా రవయన
ఖండమును సూక్ష్మ మణు తాశ్వగతి విశేష
మునకు వజ్రంబునకుపేరు దనుజ వైరి. 657

రవణ=అంచి
1 రట్టు= నింద, ఉపద్రవము, 2 రమణ రాణ. అశ్వగతివిశేషము,
తము, ప్రీతి, విధము. 3 రవ, ఖండము=సూక్ష్మము, అణువు,
వజ్రము.

గీ. రహియన యోగ్యమగు ననురాగమా వి
వేక మానంద మాసక్తి విధముపేరు

దసరె రాణివాసమన నంతఃపురమగు
భార్యయలరె నంతఃపురభామయగును. 658

1 రసి= యోగ్యము, అనురాగము, వివేకము, ఆనందము, ఆసక్తి, విధము. 2 రాణివాసము=అంతఃపురము, భార్య, అంతఃపుర కాంత.

కం. భువిరాటనఁగ నుపద్రవ
మవు జనసమ్మర్దనాఖ్య యగురిత్తయనన్
భవహర రిక్త మసత్యం
బవు మఱియు నకారణాదు లవ్యయసంజ్ఞన్ 659

1 రాటు= ఉపద్రవము, జనసమ్మర్దము, వ్యర్థము, 2 రిత్త= శూన్యము, అసత్యము, (అవ్యయమైనపుడు) కారణములేమి.

కం. రూపరియన సౌందర్యుఁడు
రూపరియనఁగా విశేష రూపవతియగున్
రూపఱుననంగ హీనత
రూపఱున నశించు మృతికిరూపగు శౌరీ. 660

1 రూపరి= సుందరాంగుఁడు, రూపవతియగు స్త్రీ 2 రూపఱు= నశించు, హీనత్వము, మరణము.

కం. దనుజాట విదహనా! వు
వ్వన ప్రక్షేపించుట మఱి యావర్తము రూ
పన నాకృతి ఋజుభావం
బును విధమును జెల్లె నాంధ్రమున భువిలోనన్. 661

1 వువ్వ= విసిరివైచుట, సుడి, 2 రూపు= ఆకృతి, సత్యము విధము.

సీ. మహిని రెట్టయనఁగ పక్షిమలము భుజము
పేరు రేఁగనగా విజృంభించు బదరి

కాద్రుమంబునకాఖ్య రేకయన రేఖ
పంక్తి పత్రికనామమై బరగు శౌరి. 662

1 రెట్ట=పత్తుల పెంట, భుజము. 2. రేగు=విజృంభించుట, రేగు చెట్టు, 3 రేక=గీత, వరుస, జాబు.

గీ. రేయుననగ ఖండించు విజృంభణమున
రేలు రేవనగా నదీతీరమార్గ
మగు సముద్రాది తీరాహ్వయంబు బదరి
కాద్రుమంబునకాఖ్యయా భవవినాశ. 663

1 రేయు=ఖండించుట, విజృంభించుట 2 రేవు=నదీతీరమార్గము, సముద్రతీరము, రేగుచెట్టు.

గీ. రొక్కమన ధనము గణంబు రొప్పనంగ
నార్తరవము ప్రధావించు టౌను కోప
మొందుటౌ రోయునాగను నిందజేత
నెగడ వర్తించు నన్వేషణించుటౌను. 664

1 రొక్కము=ధనము, సమూహము 2 రొప్పు=ఆర్తరవము, పరుగెత్తుట కోపమొందుట 3 రోయు=నిందచేయుట, వర్తనము చేయుట, వెదకుట.

గీ. అవని అంకెయనంగ వృష భారవంబు
ఘనరవంబునకగు సింహ గర్జనంబు
పేరు అంపిలునాగ వ్యాపించునతిశ
యించు వర్ధిల్లుటౌ విజృంభించు టౌను. 665

1 అంకె=వృషభధ్వని, గొప్పధ్వని, సింహగర్జనము, 2 అంపిలు = వ్యాపించు, అతిశయించు, వర్ధిల్లు, విజృంభించు.

క. వనజాక్ష! లాగయన ధూ
ర్తునికగు జాడయు నుద్దతుడు అవ్వాన అు

ప్పనఁగా ప్రక్షేపించుట
ఱను ఖగపక్షధ్వనికగు కుంజరవరదా. 666

1 ఱాఁగ=ధూర్తుఁడు, జారస్త్రీ, తీవ్రభావుఁడు, 2 ఱువ్వు(ఱుప్పు) విసరివేయుట, పక్షుల ఱెక్కలమ్రోఁత.

గీ. ఱేఁడనఁగ భర్త రాజగు ఱేయనఁగ వి
జృంభణము సేయుటౌ నతిశయించుటాఖ్య
కలిగె ఱొచ్చన మలినపంక మపవాద
మగు తిరస్కారమును జనతారవమగు. 667

1 ఱేఁడు=భర్త, రాజు. 2 ఱే=విజృంభించుట, అతిశయించుట, 3 ఱొచ్చు=మలినమగు బురద, అపవాదము, తిరస్కారము, జనసమూహపు ధ్వని.

ఉ. లంకయనంగ ద్వీపముచెలంగె ప్రఘాణము పేరు పూన్కె
నేస్
లంకెయనంగ సక్తత మెలంగెను సంగమమూను మేళనం
బింకను లంబునా ఘనతహెచ్చె విశాలము పేరు స్థూలనా
మాంకము బంపటంబనిన నాపదయాశ్రమమా జనార్దనా.

1. లంక=ద్వీపము,పంచలోనిగది, 2లంకె=కలిసియుంట, సంభోగము, కలుపుట, 3 లంబు=గొప్పతనము, విశాలము, స్థూలము, 4 లంపటము=ఆపద శ్రమ.

కం. నగభరణ లకోరి యన
నగు పారావతము కర్కశాంకితశరముఁ
లగువన సులభము లంఘన
మగు లాఘవమునకు నామమగు నాంధ్రమునన్. 667

1 లకోరి=పావురము, వాడియగు బాణము, 2 లఘువు=సులభము,

క. విమలాహ్వాయ! లగ్గనగ శు
భము నపరక్రియకు పేరు బరగె లలియన్
గ్రమమునకు ప్రేమ కుత్సా
హమునకు వికాసమునకు నభిధానంబౌ, 668

1 లగ్గు=శుభము, అపరక్రియ 2 లలి=క్రమము, ప్రేమ, ఉత్సాహము వికాసము.

క. భువిలాంచన వ్యాపించుట
కవును తిరోధానమొందుటౌ లాగనగా
నవు నాకర్షించు విధం
బవు సమ్మతమునకు నామ మాశ్రితవరదా! 669

1 లాంచు=వ్యాపించుట, మరుగుపడుట, 2 లాగు = ఆకర్షించుట, సమ్మతము, విధము,

గీ. క్షమితా లావన సామ
ర్థ్యము నక్షితి బల మశక్య మగు నాధిక్యం
బలరెను స్థూలమునకు నా
మము లెక్కయనంగ సంఖ్య మతిలక్ష్యంబౌ. 670

1 లావు=సామర్థ్యము, ఎడతెగనిది, బలము, అశక్యము, అధికము, స్థూలమైనది, 2 లెక్క=సంఖ్య, లక్ష్యము.

గీ. అవని లెస్సయనంగ యోగ్యమగును క్షేమ
మగును శ్రేష్ఠంబగును లేకయనగ
లేఖమునకౌను పంక్తికౌ పరమపురుష
తరుణామునకౌను తరుణికౌ పేరయనగ 671

1 లెస్స=యోగ్యము, శ్రేష్ఠము, 2 లేక=జాబు, పంక్తి. 3 లేమ=తరుణము స్త్రీ,

సీ. లోవయనంగ శిలోచ్చయభిన్నమ
య్యెను రథపీఠాగ్ర ముఁకుపేరు
వంకనా దిశకగు వక్రంబు పక్షమౌ
వంతనా బాధ తాపంబునదియు
వంతనగను స్పర్థ భాగంబు క్రమము సా
మ్యముపేరు వగచన ధ్యానమునకు
బరగ పశ్చాత్తాప పడుటకు శోకించు
టకు ను విచారించుటకును పేరు
గీ. వగయనంగ నాలోచనయగును శోక
మగును సంతాపమగు విధంబగు విలాస
మగును గతియగు నాధారమగును వడియ
నాఁ గృశించగు జలశోషణంబగు హరి. 673

1 లోన=కొండలోయ, రథముమీది పీట, 2 వంక=దిక్కు, వంకర ఒక పక్షము (వైపు) 3 వంత=బాధ, తాపము, నది, 4 వంత=విరోధము, భాగము, క్రమము, పోలిక, 5 వగచు=ధ్యానము, పశ్చాత్తాపము, శోకము విచారము, 6 వగ=ఆలోచనము శోకము సంతాపము, విధము, విలాసము, ఆధారము, గతి. 7 వడియు=కృశించుట, నీరు యెండిపోవుట.

క. వడయన భక్ష్యవిశేషం
బడరెను తాపంబు నుష్ణమగును శ్రమంబౌ
వడియన వేగము శౌర్యము
వడియనగా పద్యయతికి వఱలె మురారీ. 674

1 వడ=భక్ష్యము, తాపము, వేడి, శ్రమ 2 వడి=వేగము, శౌర్యము పద్యమండలి యతిస్థానము.

గీ. వన్నెయనగను శుక్లాదివర్ణ ముత్త
మాంబరము వర్ణనము సుందరము ప్రసిద్ధి

విధము కాంతి స్వర్ణాధిక్య పథ మలంకృ
తమునఁ దురగాధిరోహసా ధనము శౌరీ. 674

1 వన్నె=తెలుపు మున్నగురంగు, ఉత్తమవస్త్రము, వర్ణనము, సుందరము, ప్రసిద్ధి, విధము, కాంతి, మేలిమిబంగారము, అలంకారము. గుఱ్ఱములనెక్కు సాధనము (అంకవన్నె)

క. వరుసయనం గ్రమము పరం
పర బంధుత్వక్రమంబు పంక్తియు సామ్యం
బిరవగు వఱలన వ్యాపిం
చరయ ప్రకాశించు వర్తిలాఖ్య మురారీ. 675

1 వరుస=క్రమము, పరంపర, బంధుత్వక్రమము. పంక్తి, సామ్యము పోలు, 2 వఱలు=వ్యాపించుట, ప్రకాశించుట, వర్తించుట,

చ. వలఁతియనంగ భామయగు ప్రౌఢయధీనము నానకూల్యమౌ
వలచన మోహమొందుటకు వాంఛవహించుట కావ్యయుం బగుఁ గా
వలసన దిక్కుపాయమను పార్శ్వము ప్రౌఢిమ దక్షిణాంకమై॥
యలరె శుచిత్వముఁ గ్రకనమంచితమౌ పరివేష్టియుక్తమౌ

వలఁతి=స్త్రీ, ప్రౌఢస్త్రీ, స్వాధీనము, అనుకూలము, 2 వలచు=మోహపడుట, కోరుట, 3 వలను=దిక్కు, ఉపాయము, పార్శ్వము, ప్రౌఢిమ, కుడివైపు, శుచిత్వము, శకునము, అంచితము, ఆవరింపబడ్డది.

చ॥ వలపన కామ మిష్టము సువాసనయౌ వలమన్న విస్తృతం
బలరెను సూలమౌ వలయునన్న నవశ్యకమాట కిష్టమౌ
తలరెను యుక్తమౌట కభిధానసమగ్రుఁడ వలినాఁగ నిట్లనౌ
వలిపిడినాఁగ శైత్యగుణవాచకమౌ వటి కంపమౌ హరీ.

1 వలపు=కామము, కోరిక, సుగంధము 2 వలము=విశాలము, లావైనది 3 వలయు=ఆవశ్యకము, ఇష్టము, యుక్తము. 4 (వలివలయుపదమునకు రూపాంతరము) 5 వలసిరి=శైత్యగుణము, కంపము.

చ. వలిపయనంగ సూక్ష్మగుణ వస్త్రముగున్ బరిశుద్ధమైన దా
వలపమనంగ నట్లయగు వల్లెయనంగను పాశిపాశమై
యలరెను రజ్జువౌను వసమన్న వశంబును శక్యమౌ వళా
వళియన కౌతుకం బగును వర్ధితరౌద్రముజృంభణంబగున్

1 వలిప=సన్నని వస్త్రము, పరిశుద్ధమైనది, (వలపము ఇది వలిపెపదమునకు సమానార్థకము] 2 వల్లె=వరణుని పాశము, త్రాడు 3, వసము=వశము, శక్యము 4 వళావళి=ఉత్సాహము, కోపము, చెలరేగుట.

గీ. మేదిని వసగొనన నుద్యమించు నుత్స
హించుటకుపేరుజెల్లె వహియన పుస్త
కంబు విధమగు వాయన ఖడ్గధార
శిలరె వస్త్రంబునకుపేరు చెలగె శౌరి. 679

1 వసగొనుట—ఉద్యమించుట, ఉత్సహించుట, 2 వహి=పుస్తకము, విధము 3 వా=కత్తివాదర, ముఖము,

గీ, వాఁకయన నది పార్శ్వంబు వకృమగును
వాఁగనగ సైన్యమగు వ్యర్థభాషణంబు
స్వల్పనదికాఖ్యయౌ బహువచనమున త
రంగములకు సభిఖ్య విహంగతురగ. 680

1 వాఁక=నది, పార్శ్వము, వంకర, 2 వాఁగు=సైన్యము, వ్యర్థభాషణము, స్వల్పనది, (బహువచనమున) తరంగములు.

గీ. అవని వాఁడియనంగ శౌర్యమగు నిశిత
మగును తీక్ష్ణంబగును క్రూరమగును వాకొ

ననగ వచించుట కార్తనధ్వనికిపేరు
వాడయన వీధి గృహపంక్తి వాసన హరి. 681

1 వాఁడి=శౌర్యము, పదును, తీక్ష్ణము, క్రూరము, 2 వాకొనుట=వచించుట, ఆర్తధ్వని, 3 వాడ=వీధి, గృహపంక్తి, వాసన.

గీ. మహిని వాటమనంగ సమ్రపరిదేశ
మానుకూల్యత సక్తమానదియు వాన
కోయిలయన చాతకమునకును భుజగవి
శేషమునకు నభిఖ్యయా శేషశాయి. 682

1 వాటము=వాలుగ్నునతావు, అనుకూలముఁ కనిసినది, 3 వానకోయిల=చాతకము, సర్పభేదము.

గీ. వాయినాఁగ ముఖంబగు వక్త్రమాను
ఖడ్గధారకగును వాలికయన దీర్ఘ
మగు నిశితమగు వాలాయ మాన సదాయ
వశ్యమును బలవంత మవార్యమగును. 683

1 వాయి=ముఖము, నోరు, ఖడ్గదార 2 వాలిక=దీర్ఘమైనది వాడిఁయైనది. 3 వాలాయము=నిరంతరము, అవశ్యము,బలవంతము అడ్డగింపరానిది.

కం. క్షమితా! వాలన నవతీ
ర్ణము ఖడ్గం బతిశయించు నామమగును దీ
ర్ఘము నమ్రమగుటకగు శౌ
ర్యము కూ్రిరము నిశితమగుచురాజిలె శౌరి. 684

1 వాలు=దిగుట, కత్తి- అతిశయించుట, పొడుగు, వంగుట, శౌర్యము, క్రూరము, వాడియైనది.

కం. వాిలన నవతీర్ణించుట
వాిలన నతిశయము జెందబడు నమ్రితమా

వాలెమన నిరంతరమగు
వాలెమన నవశ్యమగుమవజులె మురాకీ. 685

1 వాలు=నిగుట, అతిశయముగుట, పంగుట. 2 వాలెము=నిరంతరము, అవశ్యకము.

మ. ధరణిక్ వావిరినాఁగమాబనెక ముత్కర్షంబునుత్కృష్టమా
పరగన్ వాసియనంగ భేదముగు లాభంబొప్పెనుత్కృష్టమా
పరిమాణంబును గౌరవంబు ఋజుభావంబయ్యెడిన్ దారత
మ్యరసంబౌమగు వింతనాఁగనగునన్యాభిఖ్యయాశ్చర్యమా.

1 వావిరి=క్రమము- అధికము- ఉత్కర్ష- ప్రశస్తము- 2 వాసి=భేదము- లాభము- ప్రశస్తము- పరిమాణము- గౌరవము- ఋజుభావము- తారతమ్యము- వింత- ఇతరము- ఆశ్చర్యము.

గీ. క్షితిని వింగడమనఁగ విస్తీర్ణమన్య
మౌను విపరీతమగు సుందరాఖ్య జెల్లు
విందనంగను బంధువౌ బంధుభోజ
నాఖ్యవిక్కన జృభించ హంకరించు. 687

1 వింగడ=విశాలము- విపరీతము- సుందరము- 2 విందు=చుట్టము- బంధుభోజనము 3 విక్క=విజృంభించుట- అహంకరించుట.

గీ. ఇలను విచ్చలవిడినా యథేచ్ఛయగు స్వ
తంత్రమగు విచ్చుమొగ్గనాఁ దనరె కుట్మ
లాఖ్య యతిచలనమున కాఖ్యయు విడి
మట్టనగ నాశ్రయము వాస మందిరంబు. 688

1 విచ్చలవిడి=యథేచ్ఛము-స్వతంత్రము- 2 విచ్చుమొగ్గ మిగులకదలిమొగ్గ విడిమట్టు 3 అగ్రమొగ్గము నివాసగృహము

క. కమలాక్షా! విడియన క్రో
ధము నేకాకియును వర్జితంబగు నరుణ

త్వము ప్రత్యేకంబు పరా
క్రమము ప్రతాపంబు నరుణ కాంతికి పేరా. 689

1 విడి=క్రోధము, ఏకాకి, విడువబడినది, ఎఱ్ఱనిది ప్రత్యేకము, పరాక్రమము, ప్రతాపము, ఎఱ్ఱనిరంగు.

గీ. ధర వితాకన నిశ్చేష్టతయగు పార
వశ్యమగు విభ్రమంబగు పరవశుడగు
మఱియు నిశ్చేష్టితునకు నామంబు జెల్లె
విన్ననువనంగ ప్రౌఢిమ విధము దనరె. 690

1 వితాకు=నిశ్చేష్ట, పరవశము, విభ్రమము, పరవశమగుట, నిశ్చేష్టితుఁడగుట. 2 విన్ననువు=నేర్పు, విధము,

కం. విన్నాణియనఁగ యతిపే
రెన్నికగొనె ప్రౌఢకొప్పె నికవిన్నాణం
బన్నను ప్రౌఢిమ పూజ్యత
పన్నుగనంచితము మల్లబంధము శౌరీ 691

1 విన్నాణి,=యతీశ్వరుఁడు, ప్రౌఢకాంత 2 విన్నాణము=నేరుపు, పూజ్యత, అంచితము, మల్లబంధము.

కం॥ విప్పన వికసించుటపే
రొప్పెను బాహుళ్యనామమొసగె విరియనం
దప్పక పుష్పము వికసన
మొప్పె నపసరిలుటకాఖ్య మొగి త్యక్తంబా. 692

1 విప్పు=వికసించుట. బాహుళ్యము, 2 విరి=పూవు, వికసించుట, తొలంగుట, విడిచిపెట్టుట,

కం॥ అంచితముగ విరియనన త్య
జించు నపసరిల్లగు వికసించుటకగు బ్యా
పించు ల్బణంబగుట భే
ధించుట కభిదానమగును దీనశరణ్యా. 693

1 విరియు=విడుచుట, తొలంగుట, విచ్చుట, వ్యాపించుట, విజృంభించుట, భేదించుట,

చ॥ అవని విరాళినాఁగ విరహంబును భక్తి విరాళమన్నపే
రవు విరహంబుఁజెందుట యుపహారవిశేషముగుఁ విసంబనఁ
గ విషము పేరుగాంచె నుదకంబునకౌ వివరించునాఁగపే
రవు విశదీకరించుటకు నన్వయమయ్యు విచార్యమైహరీ.

1 విరాళి=విరహము, భక్తి 2 విరాళను=విరహమొందుట, ఉపహారభేదము 3 విసము=విషము, జలము, 4 వివరించుట=విశదముచేయుట అన్వయము, విచారింపఁదగినది.

కం॥ శమి! తగును వీఁకయనదై
న్యము నుత్సాహము విజృంభణము నున్నతి గ
ర్వమును పరాక్రమమును సా
మ్యము ప్రథావము విధమున కాఖ్య ముకుందా. 695

1 వీఁక=దైన్యము, ఉత్సాహము, విజృంభించుట, ఉన్నతి, గర్వము, పరాక్రమము, సామ్యము, పాఱిపోవుట, విధము.

మ॥ జగతిఁ వీఁగన నుత్సహించుటగు చాంచల్యంబు గర్వింపుపే
రగు ప్రదావిమపేరు జెల్లె మఱి వీకన్నన్ బ్రతాపంబుపే
రగుగర్వంబునకాఖ్య యున్నతికిపేరౌ వీఁటిబోవన్న పెం
పుగ వ్యర్థంబగుటానుదూష్యమునశింపుఁ నష్టియామాధవా.

1 వీగు=ఉత్సహించుట, చాంచల్యము, గర్వించుట, పరుగెత్తుట 2 వీఁక=ప్రతాపము, గర్వము, ఉన్నతి, 3 వీటిపోవు=వ్యర్థమగుట, దూష్యము, నాశనము, నష్టము,

కం॥ శమితగుణా వీడన సై
న్యము పథికజనాళి విశదమగుటా బహుమా
నమును విసర్జించుట శిబి
రము వర్ధిలు పట్టణమంబు రసికచరిత్రా. 697

1 వీడు=సైన్యము, బాటసారులు, స్పష్టమగుట, బహుమానము విసర్జించుట, శిబిరము, వర్ధిలుట, పట్టణము.

మ॥ వీడు పట్టణమా(శ్రయంబగు వెంటనే శిబిరంబగున్
వీడుపాటన వ్యత్యయంబగు విభ్రమంబగు భేదమౌ
వీడుకోలన పో నను జ్ఞయు వెండియున్ మరణంబగున్
చూడుమింక విసర్జనంబయి చొప్పడెన్ ధృతభూధరా

1 వీడు=పట్టణము, ఆశ్రయము, శిబిరము, 2 వీడుపాటు=వ్యత్యయము విభ్రమము, భేదము 3 వీడుకోలు=అనుజ్ఞ, మరణము, విడిచిపెట్టుట.

కం॥ వనరుహలోచన! వీడ్కొను
ననగ ననుజ్ఞవడయుటకును నా వర్జితమ
య్యెను వీననఁగా శ్రోత్రం
బును మఱియు ప్రసిద్ధికాఖ్య మునుకొనెధరణిన్. 699

1 వీడ్కొను=అనుజ్ఞనొందుట, విడిచిపెట్టుట, 2 వీను=శ్రోత్రము, ప్రసిద్ధము,

కం॥ విమలాఖ్య వెంటనాఁగా
ర్యము పశ్చాదర్థకము మృగవ్యంబును మా
ర్గము విధము విషయంబున
కమరెను వెండియన రజితమగు తదుపరికొ. 700

1 వెంట=కార్యము, వెనుక, వేటచేయుట, మార్గము, విధము, విషయము, 2 వెండి=రజతమనులోహము, తరువాత.

గీ॥ వెంపరయనంగ హింసయౌ పీడనంబు
భేదనంబగు వెగటన విరసముసవు
పేరు తిక్తంబునకు పేరు వెకలియనఁగ
మూఢుఁడాసక్తుడౌ దేవ మునినుతాంఘ్రి. 701

1 వెంపర=హింస, పీడనము, భేదనము 2 వెగటు=విరసము, చేదు
3 వెకలి=మూఢుఁడు, ఆసక్తిగలవాఁడు.

గీ॥ అవని వెక్కసమన దుస్సహత్వమగును
దుర్లభంబగు నధికమౌ దుస్సహమగు
బహువచనసంజ్ఞ దుస్సహ వచనములకు
నాఖ్య వెగడన చలసంబు వ్యత్యసనము 702

1 వెక్కసము=దుస్సహత్వము, దుర్లభము, అధికము, సహింపరానిది. (బహువచనమున) దుస్సహవచనములు, 2 వెగడు=చలనము, వ్యత్యాసము.

క॥ వెడయన తుచ్ఛం బల్పం
బడరెను వికృతము క్వచిత్తు వ్యర్థముపేరౌ
వెడగనగ వికారంబనఁ
బడె నవివేక మవివేకి పావనచరితా 703

1 వెడ=తుచ్ఛము, అల్పము, వికృతము, ఒకానొకయెడ, వ్యర్థము, 2 వెడఁగు=వికారము, అవివేకము, అవివేకి.

గీ॥ ఇలను వెదనాఁగ పశ్వాది బుతువు కబరి
వెన్ననఁగ గృహశిఖరంబు పృష్టమగును
వెరవనగ వెరువనగను విధము యుక్త
ముపాయమునకుపేరు మునినుతాంఘ్రి. 704

1 వెద=పశ్వాదులబుతువు, కబరి. 2, వెన్ను=గృహశిఖరము. వీపు, 3 వెరవు (రూ. వెరువు)=విధము, యుక్తము, ఉపాయము.

క॥ వనజేక్షణ! వెరఁగన వెఱఁ
గన నిశ్చేష్టకునుజెల్లె నాశ్చర్యంబ
య్యెను వెఱయన నాశ్చర్యం
బును భయమునకాఖ్యయొప్పె పుణ్యచరిత్రా. 705

1 వెఱఁగు=నిశ్చేష్టము, ఆశ్చర్యము 2 వెఱ=ఆశ్చర్యము, భయము

క॥ వెలయనన ప్రకాశించుట
చెలగె ప్రసన్నత్వమును ప్రసిద్ధి గనుటకౌ

వెలదియున యోషకగు ని
ర్మలమునకు ప్రసన్నమునకురాజిలె శౌరీ. 706

1 వెలయు=ప్రకాశించు, ప్రసన్నత్వము. ప్రసిద్ధినొందుట, 2 వెలది=స్త్రీ, నిర్మలము, ప్రసన్నము,

గీ॥ క్షితి వెలార్చనగా ప్రకాశింపసేయు
నిర్గమించగు వెలియననెగడె బాహ్య
మును ధవళము బహిష్కారమును బహిఃప్ర
దేశమునకాహ్వయంబయి దేవదేవ. 707

1 వెలార్చు=ప్రకాశింపఁజేయు నిర్గమించు, 2 వెలి=బాహ్యప్రదేశము, ధవళవర్ణము- బహిష్కారము, బహిఃప్రదేశము

గీ॥ వెల్లివిరియుననంగ వ్యాపించు నుల్ల
ణంబు ప్రకటితమగుటనా మంబగు ప్రవ
హించుపేరగు వెల్లినాఁ శ్వేతవర్ణ
మగు పరంపరయగు ప్రవాహంబగు హరి. 708

1 వెల్లవిరియు=వ్యాపించుట, విజృంభించుట, ప్రకటితమగుట, ప్రవహించుట, 2 వెల్లి=శ్వేతవర్ణము, పరంపర, ప్రవాహము,

గీ॥ అవని ,వెలుగన కిరణ మాతపమగు జ్వలి
యించుటకు పేరగును ప్రకాశించుటౌను
వెల్లువయన ప్రవాహమైవెలసె సైన్య
మునకు పేరు ఈడ్యవ లీకమునకు 709

1 వెలుఁగు=కిరణము: ఎండ. ప్రకాశించుట, మండుట. 2 వెల్లువ=ప్రవాహము, సైన్యము. గోదగానుండుకంచె

గీ॥ వేయునంగ ననేకమౌ వేగమగు స
హస్రమునకాఖ్యయగు వేఁడియనఁగ నుష్ణ
మగును నైశిత్యమును తేజమగును తాప
మొలసె వేఁడిమి తాపమౌ నుష్ణమౌను. 710

1. వే=అనేకము వేగము, నెయ్యి 2 వేడి =ఉష్ణము వాఁడి 2 తేజము,తాపము 3 వేఁడిమి=తాపము, ఉష్ణము.

ఉ॥ వేడన ప్రార్థనంబునకు పేరగు యాచిత మిచ్చయించుటా
వేడబమన్న మాయకగు వేషము పేరగు వంచనాఖ్యయా
వేడుకనాఁ గుతూహలము పే రభిలాష వినోదనావహా
పీడక వేఁడివేల్పనిన పేరగు నగ్నికి నుష్ణరశ్మికిన్.

1 వేఁడు=ప్రార్థనము, యాచించుట, కోరుట, 2 వేడబము=మాయ, వేషము పంచనము, 3. వేడుక=కుతూహలము, కోరిక, వినోదము 4 వేఁడి వేల్పు=అగ్ని, సూర్యుడు.

క॥ ధర వేఁదుఱనఁగ మూఢుడు
మఱి యున్మాదనమునకు ప్రమత్తుని పేరున్
సరియగు వేఁగనచారుఁడు
బరగె ప్రభాతంబు దేశ వార్తయు శౌరీ. 712

1 వేదుఱు=మూఢుడు, ఉన్మాదము, ప్రమత్తుడు, వేఁగు=చారుఁడు ప్రభాతము, దేశవార్త.

గీ॥ వేదు తిక్కంబు గధంబు వికటగంధ
మగునితోఁధికవచనంబునందు విరస
వచనములకొను వేరన వెలసె వృత్తు
మూలమున కన్యమునకాఖ్య నీలదేహ. 713

1 వేదు=చేదు, వాసన, దుర్గంధము, అంతకంటె నెక్కువ, విరస వచనము, 2 వేరు= వృక్షమూలము. అన్యము,

ఉ॥ వేనవినాఁగనొ కబరి వేణియు కేశము వేలమన్న నీ
శానుకృపాణమందు శిబిరాఖ్యయు వేల్పనదేవతాహ్వయం
బౌ నిక జోస్యనామమున కయ్యె తెలుంగున వేరువిత్తునాఁ
బూనెను పేరు నాశనము పొందెను నాశకు డ్రాశితావనా.

1 వేనలి=కబరి, జడ, వెండ్రుకలు 2 వేలము=శంకరుని అయుధము, శిబిరము, 3 వేల్పు=దేవత, జోస్యుఁడు, 3 వేరువిత్తి=నాశనము, నాశనముచేయువాఁడు.

క॥ కమలాక్షా! వేసరునన
శ్రమపడు నిర్వేదనము విచార్యంబగు వై
నమునాఁ గారణము వివర
ణ ముపాయము క్రమము విధము పేరగు నిలలోన్ 715

1 వేసరు=శ్రమనొందుట, విచారము, విచారింపఁదగినది, 2 వైనము= కారణము వివరణము, ఉపాయము, క్రమము, విధము,

ఉ॥ పావితదేవ! వైపనఁగ పార్శ్వము లక్ష్య ముపాయమయ్యెడున్
వ్రాలన నమ్రమౌట క్షయ భావము పేరవతీర్ణమౌటకో
వ్రేలన నుద్యమించుటకు పేరగులంబిత మంగుళంబు పే
రేవిదమయ్యె వ్రేఁగు తపియించుటనామము భారనామమౌ.

1 వైపు=పార్శ్వము లక్ష్యము, ఉపాయము 2. వ్రాలు=వంగుట. నాశనమగుట, దిగుట వ్రేలు = ఉద్యమించు, వ్రేలాడుట అంగళము, పరిహాసము 5 వ్రేగు=తపించుట, భారము.

మ॥ జగతిన్ సంగడినావిధంబుడుపమున్ సామీప్యమున్ ద్వంద్వమున్
నెగడన్ పార్శ్వముసంచయంబనుగతిన్ స్నేహంబురోప్పూచు పేన్
మిగిలెన్ సంగడమన్న స్నేహమగుసామీప్యంబు సైన్యంబు పే
రగు ద్వంద్వంబగుసంకు శంఖవలయం బౌ శంఖమౌ కేశవా.

1 సంగడి=విధము, పడవ, సమీపము, జంట, పార్శ్వము, సమూహము, వెంటవచ్చుట, స్నేహము, 2. సంగడము= స్నేహము, సమీపము, సైన్యము జంట 3. సంకు=శంఖముతో 'సి వలయము, శంఖము,

గీ॥ సంచనఁగ సుందరంబు సూచనవిధంబు
జెల్లు సంతనకట్టన సిద్ధపడుట
కౌను సంక్షోభవించుట కౌను సంతు
నాఁ గులంబగు సంతాన నామమౌను. 718

1 సంచు=సుందరము. సూచన, విధము, సంతెనకట్టు=2సిద్ధపడు సంక్షోభవించు, 3 సంతు=కులము సంతానము

ఆ. సంతరించనంగ సమకృత్యమగు లభి
యింపనేయు సంగ్రహించగు ధరి
యించుకొ రచించు నెసగె సంపన వధి
యించు పేరగును సమృద్ధిపేరు 719

1 సంతరించు=సమకూర్చు, లభింపం చేయు, సంగ్రహించు, ధరించు రచించు. 2 సంపు=వధించు ,సమృద్ధి.

ఉ॥ సందడినా జనాళియగు సంకులమౌ జనతారవంబగున్
సందుకొనన్న వ్యాప్యమగు సక్తముపేరు పరిగ్రహించుపే
రొందెను సంబరంబన రసోక్తిని సంభ్రమనంగనొప్పె నా
నందము పేరగున్ ద్వరిత నామమగున్ రవిచంద్రలోచనా,

1 సందడి= జనసమూహము, సంకులము, జనులధ్వని. 2 సందుకొను= వ్యాపించు, కలసికొను,పరిగ్రహించు.3సంబరము(రూ॥సంభ్రము)=ఆనందము తొందర.

క॥ సంబడమనగా పాధే
యంబగు వైతనికక్లుప్తమగును భరణ్యా
ర్థంబగు సకియ స్త్రీనా
మంబగు సఖినామమగును హాటక చేలా 721

1 సంబడము= దాంబత్తెము, జీతము ఏర్పాటు, బత్తెము 2సకియ= స్త్రీ చెలికత్తె.

గీ॥ సకినయనంగను కృత్రిమ వికిరనామ
మగును ప్రతిమయగున్ సజ్జయనంగ నూతి
కాగృహంబున కాఖ్య శిరోగృహంబు
పిటకమగు సిద్ధమగు సస్యభేదమగును 722

1 సకిన=కృత్రిమపక్షి. పత్రిమ 2సజ్జ= సూతికాగృహము, శిరోగృహము గంపె, సిద్ధపడుట, సజ్జపైరు.

కం॥ సడియన నపకీర్తి కిపే
రడరెను సూచనకు నింద కగు సద్రయనర్
బుడమి నవశ్యకార్యము
తొడరెను లక్ష్యంబు పేరు తోయజనాభా. 723

1 సడి=అపకీర్తి,సూచన,నింద.2సద్ర =అవశ్యకమగు కార్యము,లక్ష్యము

ఉ. సత్తన సీసభేదమగు సత్యమగుర్ బలమందువర్తిలుర్
సత్తియసంగ శక్తియగు శస్త్రవిశేషమగుర్ బలంబు పే
రత్తెను పార్వతీసతికి నాహ్వాయమౌను వసిష్ఠసూను డా
యత్తపరిర్ భువిర్ సమయు నన్న మృతించు .నశించు పేరగున్

సత్తు= సీసములోని భేదము. సత్యము, బలము, 2, సత్తి=శక్తి, ఆయుధవిశేషము, బలము- శంకరుఁడు, వసిష్ఠమునికుమారుఁడు. 3 సమయు= మరణించుట, నశించుట

గీ॥ సమకట్టన కవచము కృ
త్య ముపాయ నివారణమున కాహ్వాయమౌ క్లు
ప్తము చేయు సిద్ధపఱచగు
సమేల మనుకూలము గును సంసర్గంబౌ 725

1 సమకట్టు= కవచము, పని, ఉపాయము, అడ్డగించుట, క్లుప్తము చేయుట, సిద్ధము చేయుట. 2, సమేల = అనుకూలము, కలసియుండుట,

గీ. వాసిగ సయ్యాటయన వి
లాసము సహకేళికాది లక్ష్యమగు పరీ
హాసంబగు సరమనగా
నాసర్ శ్వాసంబు స్వరము నాళీకాక్షా 726

1 సయ్యాటము= విలాసము, స్త్రీపురుషులు కలసియాడుట, పరిహాసము, 2 సరము= శ్వాసము, స్వరము.

గీ. సరియన హారము సమయం
బరయగ యుక్తము సమాప్తమగు పూర్ణంబొ
సరిగయన స్వర్ణతంతువు
పరగెను హారంబుపేరు పావనచరితా॥ 727

1సరి= హారము. సమయము. యుక్తము. సమాప్తము. పూర్ణము.
2 సరిగ= బంగారుతీఁగ, హారము

గీ. సవతునాఁగ సమానము సామ్యమౌను
ససియనంగ నారోగ్యమౌ సస్యమగును
ప్రబలకాంతికినగు ఋజుభావమగును
ఋజువు నారోగ్యభావమౌ కృష్ణవర్ణ. 728

1 సవతు= సమానము. సామ్యము, 2 ససి= ఆరోగ్యము. పైరు
విస్తారమగు కాంతి. ఋజుభావము. సత్యము. ఆరోగ్యముగానుండుట.

గీ. వసుధసాంబ్రాణియన ధూపవస్తు వుత్త
మాశ్వమునకాఖ్య సాకతమన నను్గ్ర
హంబు నుపశమించుటకాఖ్యయౌను సాక
మనగ నుత్సవమగు వ్యాజమౌను శౌరి. 730

1 సాంబ్రాణి= ధూపవస్తువు. ఉత్తమాశ్వము. 2 సాకతము= అనుగ్ర
హము. ఉపశమించుట. 3 సాకము= ఉత్సవము. నెపము.

గీ॥ అవని పాతన పథికజవాళిపేరు
వర్తకసమూహమునకాఖ్య వఱలె సామి
యనఁగ స్కంధుడు భర్త రాజౌను సారి
యనఁగ నావృతమగు యుద్ధయాత్రయగును 731

1 పాతు=బాటసారులు. వర్తకసమూహము. 2 సామి= కుమారస్వా
మి. మగడు. రాజు. 3. సారి= ఆవృతము, యుద్ధప్రయాణము

కం॥ సారెయన యాతకంబగు
శారిక పేరగు కులాల చక్రంబునకా
శారిఫలం బక్షముకు
పేరగు బహువాచకమున వీణాతంతుల్ 732

1 సారె= కూతురును అత్తవారింటికిఁబంపునపుడిచ్చుసామగ్రి. గోరువంక. కుమ్మరివానిచక్రము. సొగటాలకాయ. పాచిక. (బహువచనమున) వీణాతీగ,

చ॥ సిరము సిరస్సు శైత్యమగు సీదరమన్నను సర్పకంచుకం
బరయ భుజంగమంబునకు నాహ్వయమౌను దరిద్రనామమౌ
సిరియనగా శుభంబునకు జెల్లెను లక్ష్మికి సంపదాఖ్యయౌ
స్థిరముగ సీమనాఁగను ప్రదేశము దేశము రాజ్యమౌ హరీ.

1 సిరము. సిరస్సు= శైత్యము. 2. సీదరము=పాముకుబుసము. పాము, దరిద్రము. 3. సిరి= శుభము. లక్ష్మి. సంపద. స్థిరము 4. సీమ= ప్రదేశము దేశము. రాజ్యము,

గీ సుద్దియన కవచము పరిశుద్ధమగుచు
బరగె వృత్తాంతమౌను సుపాణియనగ
దనరె మౌక్తిక శోభ ముక్తాఫలాఖ్య
మెసగె సురతాణి శచియగు నిందుఁడౌను 734

1 సుద్ది= కవచము, పరిశుద్ధము. వృత్తాంతము 2. సుపాణి= ముత్తెములకాంతి. ముత్తెములు. 3 సురతాణి= శచీదేవి. ఇంద్రుడు,

కం॥ సురయన ననిలావృత్తము
సురయన ననిలం బధికము సురుఁగన గమనిం
పరయ చలిం చ దృశంబగు
మరియు పరిధావించుపేరు మన్మథజనకా 735

1 సుర= సుడిగాలి గాలి. అధికము. 2 సురుఁగు= గమనింపు. చలించుట. సదృశమగుట, పరుగెత్తిపోవుట.

గీ॥ సూటినా లక్ష్యము విధంబు సూడిగముల
నంగ వలయంబులగు కంకణంబులగును
సెగయనఁగ సెకయన జ్వాలయగును తాప
మగు సెగ్గమనగ నింద్యవర్తనంబు 736

1 సూటి= లక్ష్యము. విధము. 2 సూడిగములు =కడియములు, గాజులు
3 సెగ. సెక= జ్వాల. తాపము 4 సెగ్గము= నింద్యవర్తనము.

క. సేదియన నష్టి నాశంబు సేకరించ
నఁగ నుపశమిల్లు సంగ్రహించఁ జగును సేమ
మన శుభంబగు మఱిక్షేమమగును సేస
యనఁగ సీమంతమునకగు నక్షతలగు 737

1 సేది= నష్టము, నాశనము. 2 సేకరించు=ఉపశమించు. సంగ్రహించు, 3. సేమము= శుభము. క్షేమము, 4 సేస= పాపట. అక్షతలు.

నానార్ధవర్గముగిసెను

---

# అవ్యయవరు.

కం, తూరియనఁ రువ్వంబన
పారియనఁ రువ్వనాఁగ పరినా మైనా
సారియనఁగ తెనుఁగున కడ
తే రావృత్త్యార్ధకమును దెల్పుచు శౌరీ 738

తూరి, రువ్వము. పారి, రువ్వు. పరి. మై, సారి. ఇవి. పర్యాయము అనునర్థమిచ్చును.

కం ఎటులన నెట్లన నెట్టన
నెటువలెనా నెట్టులనఁగ నెట్టెట్టూనా
నెటువోలె నెట్టువలెనా
నెటనఁగను యత్నద్ధకారమిలదెల్పు హరీ. 739

ఎటులు. ఎట్లు. ఎట్టన. ఎటువలె. ఎట్టుల, ఎట్టెట్టూ, ఎటువోలె, ఎట్టువలె. ఎటు= ఇవి యేవిధము అనునర్థమిచ్చును

ఆ. ఎట్టకేనియనిన నెట్టకునేనినా
నెట్టకేలకనిన నెటకునేని
యనఁగనొ నతిప్రయాసార్థసూచన
దెల్పు నవ్యయములు దేవదేవ 740

ఎట్టకేని, ఎట్టకునేని. ఎట్టకేలకున్, ఎటకునేని. ఇవిఅతిప్రయాసము నుసూచించును,

గీ॥ ఈయనఁగ నిదియనఁ జెల్లె నియమభిఖ్య
లట్లనంగను తద్ప్రకారార్థమౌను
చెఱియనంగ తలాయనఁ జెల్లె నాంధ్ర
మున ముకుంద యేకైకార్థమును దెలుపుచు. 741

ఈ, ఇది, నిర్దేశార్థకములు, అట్లు తత్ప్రకారార్థకము, చెఱి, తలా, అనేకార్థకములు,

గీ. ఆయనఁగ నదియనఁగవేల్లఁ తదర్థ
మునకు వల్లేయనంగను దనరె వల్లె
యనఁగ కానీయనంగ వేళ్లవ్యయమున
దనరె ధరణి నంగీకారమునకు శౌరీ. 742

ఆ, అది, తదర్థకములు, వల్లే. వల్లె. కానీ, అంగీకారార్థకములు

కం॥ ఇసిరో యిస్సీ యీహీ
యుసియును మఱియిస్సిరో యిహీ మఱియిహిహీ
యిసీయన నీద్వయముఁ దెల్పును
వసుధను తెనుఁగవ్యయములు వాసవవినుతా 743

ఇసిరో, ఇస్సీ, ఈహీ, ఇసి. ఇస్సిరో, ఇహీ, ఇహిహీ, ఇసీ ఇవి నిందార్థకములు,

కం॥ ఏమీ యెట్టూ యేయన
యేమియనన్ ప్రశ్నమునకు నేర్పడిజాడల్
కామించెను డబ్బాటన
స్వామి యకస్మాత్తుగనను జాడ మురారీ 744

ఏమీ, ఎట్టూ, ఏ. ఏమి, ఇవిప్రశ్నార్థకబోధకములు, డబ్బాటు. ఆకస్మికముగ ననియర్థము.

గీ॥ ఆంధ్రమున నొంగె యొండేని యనఁగ కాని
పక్షమున కర్థసూచన బరఁగెను మఱి
యిటుల నిట్టుల నిట్లను నిట్టనంగ
నివ్విధార్థంబుదెల్పు సురేశపాల 745

ఒంగె. ఒండేని. ఇవి కాదనునర్థము తెలుపును. మఱి, ఇటులన్ ఇట్టులన్ ఇట్లు. ఇటు, ఇట్టు. ఈవిధమను నర్థము తెల్పును.

గీ, పృథ్వి నెట్టైనను నెట్టైనఁగ నెవ్విధము నైన
యనుట కిటఁబట్టినా నిదమాదిగ నని
యలరె నీనాయనఁగ యుష్మదస్మదర్థ
మగుచు నవ్యయవర్గన కంతమయ్యె 746

ఎట్టైట్టు= ఏవిధముగానైనను' ఇటబట్టి= ఇదిమొదలు, నీ, నా= ఇవి యుష్మదస్మదర్థకములు.

అవ్యయవర్గ ముగిసెను.

---

# నానార్థావ్యయ వర్గు.

కం॥ అని సవి సావి ప్రసరం
బును స్మరియించుట ప్రకారమును వాక్యము కా
రణ మిలి యవ్యయరూపం
బును సూచనఁజేయు కావ్య ముఖమునశౌరీ 746

అని. సవి. సావి ఇవి యవ్యయరూపములు. ఈపద్యమునకర్థము సం
దేహాస్పదముగనున్నది.)

గీ॥ ఐనవా బూర్వవాగ్వి రుద్ధార్థము సమ
యార్థకంబు నిర్ధశ్యాస్వయముసు వికల్ప
కార్థమును న్యూనసూచన యవ్యయమున
దెలుపు తెనుఁగున మునిలోల దీనపాల 747

ఐన= పూర్వవాగ్విరుద్ధార్థము, సమయార్థము. నిర్ధష్యార్థము, వికల్పకార్థము. న్యూనసూచనము.

కం॥ కమలాక్షా బిట్టన శీ
ఘ్రముగా దృఢముగ ననెకు వికారముఁదెలుపుఁ
గ్రమమున వలెయనఁగా సా
మ్యము నిష్టము దెల్పుస్వర్ణమయ చేలాంకా 748

1 బిట్టు= శీఘ్రము: దృఢము. 2 వలె= సామ్యము. ఇష్టము.

గీ. కాని కానీయనంగ వికల్పముఁ కు
నెదుటి వాగ్విరుద్ధమునకు తదితరము నది
కగును సూచన యొండన నన్యమునకు
నేకతమునన జాడయే నింది రేశ 749

1 కాని. కానీ= వికల్పము. ఎదుటివాక్కునకు విరుద్ధము, తదితరము
2 ఒండు= ఇతరము ఒంటరిలేనము.

సీ. అకటన యక్కటా యక్కట యయ్యారె
యయ్యారె యయ్యారే యకట కదరె
యయ్యొ యయ్యో ఝల్ల యాహా యయారె యో
చెల్ల ఝౌరార యొచ్చెల్ల యొచెల
ఝౌర కట్టా కట్ట యక్కట చెల్లరే
యోచెల కటకటా యొచ్చెల కట
ఝౌరా యయారే యయరె యకటా కట్ట
చెల్లంబో కటకట చెల్లరె యను
గీ. అగుర యవుర యయ్యారే యహారె యనగ
నాంధ్రమున నివి సంతాప కార్థములును
దెలుపు నాశ్చర్యమర్థముల్ దెల్పునట్టి
యవ్యయములు రమాహృద యాబ్జభృంగ 750

అకట. అక్కటా. అక్కట అయ్యారె. అయ్యారే, అయ్యారె. అకట. కదరె. అయ్యొ. అయ్యో. ఝల్ల. ఆహా, అయారె. ఓచెల్ల ఝౌరార. ఒచ్చెల్ల. ఒచెల. ఝౌర. కట్టా. కట్ట. అక్కట. చెల్లరే. ఓచెల. కటకటా, ఒచ్చెల. కట ఝౌరా. అయారే. అయరె. అకటా. కట్ట. చెల్లంబో. కటకట. చెల్లరె, అగుర. అవుర అయ్యారే, అహారే, ఇవి సంతాపార్థము నందును, ఆశ్చర్యార్థమునందును ఉపయోగించు అవ్యయములు.

సీ. అజ్జరే నల్లవో యద్దిరా యాహారే
యాహా యహహరే యహారె బళిరె
యహహా యసాదునా హారె బలే బళీ
యజ్జారె బాపురే యౌర బళిర
మజ్జారె మజ్జరె మమ్మరె మమ్మారె
మాయరే బళిరయ్య మజ్జరె మజ

మజ్జ మజ్జా బలా మమ్మ మమ్మా బళి
మమ్మరే బళిరె మమ్మా బళారె
గీ. మాబలారా బళీరె యారా బళార
నల్లవొ సెబాసు మేల్ మేలు బల్లబల్ల
బాపురె బళిరా యజ్జ సేబాసనంగ
నగు ప్రశంసనార్థాశ్చర్య కార్థసమితి 752

అజ్జరే. అల్లవో. అద్దిరా. ఆహారే, ఆహా. అహరే, అహాశే బళిరే. అహహా అసాదు. హారె. బలే. బళీ- అజ్జారె. బాపురే. ఔర, బళిర. మజ్జారె. మజ్జరె. మమ్మరె, మమ్మారె. మాయరే. బళిరయ్యా. మజ్జరె. మజ. మజ్జ. మజ్జా, బలా. మమ్మ. మమ్మా. బళి. మమ్మరే. బళిరె. మమ్మా. బళారె. మాబలారా, బళీరే. ఔరా! బళార. నల్లవో. సెబాసు. మేల్ మేలు. బల్లబల్ల బాపురె. బళిరా. అజ్జ. సెబాసు. —ఇవి ప్రశంసార్థము, ఆశ్చర్యార్థము నిచ్చు అవ్యయములు,

కం ఊరక యన వ్యర్థార్థమ
కారణమును విఫలయత్న గతిసూచన పే
ర్శారా పోయన నిశ్చయ
మారయగ ననాదరమున కర్థముదెల్పున్ 753

ఊరక=అకారణము. ప్రయత్నముచేయమి. 2ఔరా. పోరా=ఇవి అనాదర శార్థకములు.

అశ్వాసాంతము.

మాలిని. విమలకమలనేత్రా విశ్వజిజ్జైత్రియాత్రా
శమితకలుషసూత్రా సర్వలోకైకపాత్రా
విమతగళలవిత్రా వీరలక్ష్మీకళత్రా
సమధికసుచరిత్రా శ్యామలాంభోదగాత్రా

కం॥ వెంకట శైలవిహారా!
శంకరముఖ నిర్జరేంద్రసంస్తుతధీరా!
సంకోచరహితశూరా!
పంకజభవజననాభి పద్మాధారా!

## గద్య

ఇదిశ్రీమదలర్మేల్మంగోత్తుంగ స్తన శృంగసంగధారాధర
వేంకటేశ్వర కృపాపాంగలబ్ధ వాగ్వైభవనిరంతర
భగవతారాధనాధేయుతూముకులపవిత్రసర్వేశా
భిధాన పుత్ర రామదాస ప్రణీతంబైన యాం
ధ్రపదనిధానంబను నిఘంటువునందు
విశేష విఘ్న సంకీర్ణ నానార్థ అవ్యయ
నానార్థవ్యయ వర్గయుత తృతీయ
కాండము ముగిసెను.
మంగళం భవేత్
సర్వము సమాప్తము.